అట్టలోపలి వైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కన బడేది శుద్ధోదన మహారాజుకు గౌతమబుద్ధుని తల్లి యైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్యులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారత దేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

నాగార్జున కొండ క్రీ. శ. 3 వ శతాబ్దం.
(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యంతో).

భారతీయ సాహిత్య నిర్మాతలు

# గిడుగు వేంకట రామమూర్తి

హెచ్. ఎస్. బ్రహ్మానంద

సాహిత్య అకాడెమీ

*GIDUGU VENKATA RAMAMOORTHI*—by H.S. Brahmananda
Sahitya Akademi. 1990. Rs. 10.


First edition: *1990*

సాహిత్య అకాడెమీ
ప్రధాన కార్యాలయం :
రవీంద్ర భవన్ 35, ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ-110 001
విక్రయ విభాగం :
'స్వాతి, మందిర్‌మార్గ్, న్యూఢిల్లీ-110 001
ప్రాంతీయ కార్యాలయాలు :
29 ఎల్డామ్స్ రోడ్, తేనాం పేట, మద్రాస్-600 018
బ్లాక్ V - బి రవీంద్ర స్టేడియమ్, కలకత్తా-700 029
172, ముంబాయీ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్ దాదర్,
బొంబాయి 400 014

రూ : 10

Gee Bee Graphics Madras-21.

# విషయసూచిక


| | | |
|---|---|---|
| కృతజ్ఞతలు | .... | 7 |
| మార్గదర్శి | .... | 9 |
| జీవిత సంగ్రహం | .... | 10 |
| బహుముఖ పాండిత్యం | .... | 37 |
| కళాప్రపూర్ణుడి వాగ్యుద్ధాలు | .... | 57 |
| మహితాత్ముడు | .... | 77 |
| ఆధునిక సాహిత్యం–గిడుగు ప్రోద్బలం | .... | 84 |
| గ్రంథ సూచిక | .... | 87 |
| రామమూర్తి జీవితంలో ముఖ్యమైన తేదీలు | .... | 97 |

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ రచన ద్వారా గిడుగు వారి కృషిని స్మరించడానికి అవకాశం ఇచ్చిన సాహిత్య అకాడమీ కార్యదర్శి ఆచార్య ఇంద్రనాథ్ చౌధురి గారికి,

నా భాషా సాహిత్య వ్యాసంగంలో మార్గ నిర్దేశకులు ఆచార్యులు భద్రిరాజు కృష్ణమూర్తి, జి. యన్. రెడ్డి, టి. కోటేశ్వరరావు, చేకూరి రామారావు గార్లకు,

గిడుగు వారి కృషి దేశానికి వెల్లడికావాలని పరితపించి, ఆశ తీరకుండానే అకాల మృత్యువుపాలైన ఢిల్లీ మిత్రుడు డా. కాపూరి రమేష్ గారికి,

తన విషయ సేకరణను నా ముందుంచిన స్నేహశీలి శ్రీ పాతవల్లి చంద్రశేఖర్ గారికి,

నా అర్ధాంగి అవధానం నిర్మలకు

అనంతపురం
31-8-87

హృదయపూర్వక కృతజ్ఞతలు.

*బ్రహ్మానంద.*

# మార్గదర్శి

రామమూర్తిగారు తెలుగు భాషా సాహిత్యాలకు ఈ శతాబ్దంలో ఒక కొత్త ఒరవడిని దిద్దిన మహనీయుడు. 11 వ శతాబ్దంలో నన్నయ నారాయణభట్టులు చేసిన ప్రయోగం తెలుగులో భారతాన్ని వ్రాయటం ఈ శతాబ్దంలో 'గ్రామ్యం' అని నిరసించబడిన వ్యావహారికాన్ని లక్ష్య లక్షణ సృష్టి చేసి కావ్యోపయోగిగా మార్చిన గురజాడ గిడుగులు 'జంట పదం' లా విడదీయరాని సంబంధమున్న ఆధునిక మేధావులు.

రామమూర్తిగారు సైద్ధాంతికంగా నిరూపించిన విషయం తెలుగు భాషలో తమిళంలో లాగా ద్విభాషా వ్యవహారస్థితి (diglossia) లేదని. వ్యావహారిక భాషా ప్రయోజనాల్ని ఉద్యమ స్థాయిలో ప్రచారం చేశారు.

ఈ గ్రంథంలో రామమూర్తిగారి సవర భాషా పరిశోధనను విస్తారంగా చర్చించాను మొత్తం భారత దేశానికి గిరిజన పరిశోధనలకు 'నమూనా' తయారుచేసిన గిడుగు వారి కృషిని భారతీయ భాష లన్నిటిలోను తెలియ జెప్పాల్సిన అవసరం వుంది.

అందుకే రామమూర్తిగారు తమ దీర్ఘ దర్శనం ద్వారా వచ్చే శతాబ్దంలోకి కూడా చొచ్చుకు పోగలుగుతారు. ఆయన భాషా సాహిత్య పరిశోధకులకు మార్గదర్శి.

# అధ్యాయం 1

# జీవిత సంగ్రహం

గిడుగు వెంకట రామమూర్తి పూర్వీకులు ఆంధ్రదేశంలోని గోదావరి జిల్లా, అమలాపురం తాలూకా ఇందుపల్లిలో వుండే వారు. గిడుగు వారి వంశీకులలో ఒకడైన గిడుగు వీరరాజుగారు విశాఖపట్టణం జిల్లాకు వచ్చి విజయనగర సంస్థానంలో సముద్దారు (రెవిన్యూ ఇన్‌స్పెక్టర్) గా చేరారు. ఉద్యోగ రీత్యా 1860-75 ల నడుమ ఆయన శ్రీకాకుళం ప్రాంతంలో ఉన్నారు ఆ జిల్లాలో ముఖలింగం సుప్రసిద్ధమైన శైవక్షేత్రం. దానికి రెండు మైళ్ళ దూరంలో పర్వతాల పేట అనే గ్రామం ఉంది.

ఆ గ్రామంలో 1863 ఆగస్టు 29 న రామమూర్తి పుట్టారు. ఆ ఊరికి దగ్గర వంశధారానది ప్రవహిస్తుంది. ఆ నదికి ఆవలవైపు జయపూర్ సంస్థాన ప్రభువు నగరికటకం అనే ఊరిలో వుండే వారు. ఆ రోజుల్లో ప్రభువు మీద గూఢచారిగా వీరరాజు పంతులుకు అదనపు బాధ్యత లుండేవి. ఆ కారణంగా పంతులుగారు రాజా వారి కుటుంబంతో మైత్రిని పాటిస్తూ వారిని గమనిస్తూ ఉండేవారు. రామమూర్తి పుట్టిన నాలుగు సంవత్సరాలకు రాజా వారికి విక్రమ దేవవర్మ (1867-1952) పుట్టాడు. జీవితాంతం ప్రాణ మిత్రులుగా మిగిలిపోయిన రామమూర్తి విక్రమదేవ్ వర్మలు వంశధారా నది ఒడ్డున్నే తమ బాల్యాన్ని గడిపారు.

వీరరాజుగారి భార్య వెంకమ్మగారిది విజయనగరం. పోడూరి సీతాపతిగారి కుమార్తె. రామమూర్తి పుట్టాక ఇద్దరు కూతుళ్ళు పుట్టారు. ఆ రోజుల్లో సంప్రదాయం ప్రకారంగానే 5 వ సంవత్సరం 5 వ నెల 5 వ రోజున రామమూర్తికి అక్షరాభ్యాసం చేశారు. గోనెపాడు నుంచి వారణాసి గున్నయ్య పంతులుగారని ఒక

మాష్టారు వచ్చి రామమూర్తికి సంస్కృతం, తెలుగు, గణితం నేర్పేవారు. సూక్ష్మ గ్రాహి, అసాధారణమైన ధారణ ఉన్న రామమూర్తి శబ్ద మంజరిని 8 సంవత్సరాలకే నేర్చుకున్నాడు. తీరుబడిగా ఉన్నపుడు వీరరాజుగారే కుమారుని దగ్గర కూర్చో పెట్టుకుని బాల రామాయణ శ్లోకాలను, భారత భాగవత పద్యాలను చదివిస్తూ ఉండేవారు. అమ్మ నిదురకి ముందు పురాణ కథల్ని కమ్మగా చెప్పేది.

1874 లో రామమూర్తికి విజయనగరంలో ఉపనయనం జరిగింది. యథావిధిగా రామమూర్తి మాధుకర భిక్షను ఎత్తాడు. సంధ్యావందనం నేర్చుకున్నాడు. ఒక రోజున కుమారుడు సంధ్యావందనం చెయ్యలేదని తెలిసి వీరరాజుగారు కఠినంగా దండించారు తరువాతి రోజుల్లో రామమూర్తి దేవతార్చన మానేశాడు. కాని జీవితాంతమూ సంధ్యావందనం మాత్రం మానలేదు.

1875 లో పంతులుగారికి చోడవరానికి బదిలీ అయింది. సంసారం మాత్రం విజయనగరంలోనే ఉండేది. కొన్ని నెలలు గడిచాయి. వీరరాజుగారు ఆకస్మికంగా చనిపోయారు. వెంకమ్మగారికి సంసారం ఎలా నెట్టుకురావాలో అర్థం కాలేదు. ఇందుపల్లిలో కొబ్బరి తోటలున్నాయన్న మాటే కాని ఆదాయం మాత్రం సరిగా వచ్చేది కాదు. వీరరాజు పంతులుగారు సంస్థానానికి ఎంతో లాభం చూపిస్తూ పనిచేసినందువల్ల ఆ ప్రాంతంలోని సిద్ధాంతం దొరలు అక్కడికి దగ్గరగా ఉన్న మతలబుపేట ఇనాం భూమి నొకదాన్ని సంస్థానం అనుమతితో దానం చేశారు. కాని ఈ విషయం తెలీని వెకమ్మ తన ఒంటిమీది నగల్ని అమ్ముతూ పిల్లల్ని కాపాడింది.

రామమూర్తి చురుకైన కుర్రాడుగా పేరు తెచ్చుకొన్నాడు. పక్కింటిలో ఉన్న కాళ్ళకూరి విశ్వనాథంగారు రామమూర్తిని చేరదీసి ఇంగ్లీషు చెప్పించారు. అదే యేడు ( 975)

రామమూర్తి మహారాజవారి కళాశాలలో చేరాడు. లోయర్ ఫోర్తు, అప్పర్ ఫోర్తు, ఫిఫ్తు, మెట్రిక్యులేషన్ అక్కడే చదివారు. అప్పుడు ప్రిన్సిపాలు చంద్రశేఖర శాస్త్రిగారు. ఆయన మంచి సంస్కృత పండితుడు. వారింట్లోనే గురజాడ అప్పారావు అనే మనోజ్ఞ కుర్రాడితో రామమూర్తికి పరిచయమైంది. సన్నగా ఈనె పుల్లలా ఉన్న అప్పారావు మీద రామమూర్తికి గౌరవం అభిమానం ఏర్పడ్డాయి. ఒక ఏడాది తనకన్నా పెద్దవాడు, అయినా చూడ్డానికి మాత్రం తమ్ముడిలా కనిపించే అప్పారావు కబుర్లతో రామమూర్తి పొట్ట నింపేవాడు.

ఆ రోజుల్లో రామమూర్తితో చదివిన మరికొందరు పిల్లలు తరువాతి రోజుల్లో సుప్రసిద్ధులయ్యారు. మహారాజా కళాశాల సృష్టించిన చరిత్ర అది. కేసరి కామేశ్వరరావు, బుర్రా పార్వతీశం, ఆదిభట్ల సూర్యనారాయణలు గిడుగు గురజాడల ప్రాణమిత్రులయ్యారు. సూర్యనారాయణ సంగీత ప్రియుడు. అప్పారావు కవితలు అల్లేవాడు. రామమూర్తి చాలా 'సీరియస్' విద్యార్థి. పట్టుదలతో చదివేవాడు.

కాని చాలా అమాయకంగా ఉండేవాడు. సాయంత్రం పూట రామమూర్తి అప్పారావుతో వాహ్యాళి వెళ్ళేవాడు. విజయనగరం బయట చేల వెంట తిరుగుతున్న సమయంలో ఒకసారి అప్పారావు తాను మేఘమల్హార్ రాగం పాడితే వర్షం తప్పకుండా వస్తుందన్నాడు. పాడాడు. అదేమి చిత్రమో ఆవేళ నిజంగానే వర్షం పడింది. కొన్ని రోజులు గడిచాక మిత్రుడి సామర్థ్యాన్ని పరీక్షించాలనుకొని 'ఊ! సరే ఇప్పుడు పాడు!' అని అడిగాడు. అప్పారావు ఆకాశం వైపు చూశాడు. మేఘాలు లేవు. ఇక పాడినా లాభం లేదు. కాని అప్పారావు ఉద్దండపిండం. పాడాడు. కాని వాన మాత్రం రాలేదు. రామమూర్తి ముఖంలో చిరునవ్వు

తాండవించబోతోంది. అంతలో అప్పారావు అన్నాడు : ''చూశావూ! నాకన్నా మంచి పాటగా డెవడో మరోచోట పాడు తున్నాడు. అంచేతే మేఘాలన్నీ అటువైపు వెళ్ళిపోయా''యని.

రామమూర్తి ఏమంటాడు? అవును కాబోలని తల ఊపాడు. ఇలా వృద్ధిపొందిన వారి మైత్రి జీవితాంతం కొనసాగింది.

1879 లో రామమూర్తి అప్పారావులు ఇద్దరూ మెట్రిక్ ఒకేసారి పాసయ్యారు. అప్పారావు ఉన్నత విద్య సాగిస్తానన్నాడు. రామమూర్తికి చదువు మానెయ్యక తప్పింది కాదు. విశాఖ పట్టణంలో కలెక్టరు కచేరిలో ఆరు మాసాలు గుమాస్తా పనికోసం వాలంటరీ చేశాడు.

ఇంతలో వెంకమ్మగారు కొడుకుని పెళ్ళిచేసుకొమ్మని ఒత్తిడి చేసింది. అదే ఏడాది (1879) లో కందికొండ రామదాసుగారి అమ్మాయి అన్నపూర్ణతో రామమూర్తి పెళ్ళి నిరాడంబరంగా జరిగిపోయింది. రామదాసుగారు బాగా ఉన్నవారే. భీముని పట్నంలో ఓడ వర్తకంలో వాటాదారుగా ఆయన ఆ ప్రాంతంలో మంచి పేరున్న వారు కూడా.

ఇలా ఉండగా 1880 లో స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగారు రెండు ఉద్యోగాలలో ఏది కావాలని అడిగారు. విజయనగరానికి సమీపంలో ఉన్న కోనాడ గ్రామంలో 25 రూపాయల బడి పంతులు ద్యోగం. మరొకటి ఎక్కడో దూరంగా మన్య ప్రదేశంలో వ్యాధులకు ఆలవాలమైన పర్లాకిమిడి రాజావారి పాఠశాలలో 30 రూపాయలకు పంతులు పని. ఆ రోజుల్లో ఐదు రూపాయలు అదనంగా రావటం అంటే పెద్ద విషయమే. అంచేత పర్లాకిమిడికి వెళ్ళి పనిలో చేరారు. ఏ సమయంలో పర్లాకిమిడి చేరారో కాని 56 సంవత్సరాల పాటు అక్కడే స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. కొద్దిపాటి ఆస్తి కూడా సంపాయించారు.

ఒక వైపు అసిస్టెంటు టీచరుగా పని. మరోవైపు సంసార బాధ్యత. చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు చేయాలి. మూడు నాలుగేళ్ళు పని చేసి నాలుగు రాళ్ళు వెనకేసుకొని వారి పెళ్ళిళ్ళు చేశాడు. కొంత స్థిమిత పడ్డాడు. అప్పారావు మాత్రం ఇన్నేళ్ళు విజయనగరంలోనే ఉండి చదువులు పూర్తిచేశాడు.

అన్నపూర్ణమ్మ కాపురానికి వచ్చింది. కాన్పు కోసం రామమూర్తి భార్యను భీముని పట్నానికి తీసుకువెళ్ళాడు. తాతగారింటిలో 1885 జనవరి 28 న ఒక అబ్బాయి పుట్టాడు. తమ ఇలవేల్పు పేరు కలిసి వచ్చేట్టుగా వేంకట సీతాపతి అని పేరు పెట్టారు.

1886 లో అప్పారావు బి. ఎ. పాసై 1887 లో విజయనగరం కాలేజిలో చరిత్ర అధ్యాపకుడిగా చేరాడు. రామమూర్తికి మాత్రం చదవటం కుదిరింది కాదు. అలా ఇలా కష్టపడి ఎఫ్. ఎ. పరీక్ష 1887 లో పాసయ్యాడు. సబ్ రిజిస్ట్రారు పదవికి దరఖాస్తు పెట్టాడు. ఉద్యోగమయితే వచ్చింది కాని వెంకమ్మగారికిష్టం లేక మానుకున్నాడు. మరికొద్ది నెలలకి ఆమె కూడా చనిపోయింది.

సీతాపతి పుట్టాక మరో అబ్బాయి పుట్టాడు. వీరరాజు అని పేరు పెట్టారు. మరి రెండేళ్ళకు మరో అబ్బాయి. రామదాసు అని పేరు.

ఈ మధ్యలో రామమూర్తికి పర్లాకిమిడి చుట్టూ మాళువా పర్వతశ్రేణుల్లో నివసించే 'సవర' జాతి ప్రజలతో పరిచయం ఏర్పడింది. వాళ్ళ అమాయకత్వానికి, వెనుకబడిన తనానికి ఆయనలో ఆవేదన పుట్టింది. పురుషులు గోచీ తప్ప వేరే బట్ట ఎరుగరు. స్త్రీలు నడుము చుట్టూ మాత్రం ఓ గుడ్డ ముక్క కట్టుకునేవారు. డబ్బు లెక్క పెట్టడం కూడా తెలీదు. వారం వారం జరిగే సంతలకి మాత్రం పర్లాకిమిడి వచ్చి పోతుంటే వారి సంస్కృతి మీద, భాష

మీాద రామమూర్తికి ఆసక్తి పుట్టింది. ఇలా మూడేళ్ళు గడిచాయి. బి. ఎ. లో ఇంగ్లీషు, సంస్కృతం భాగాలు పాసయ్యారు.

1892 లో అన్నపూర్ణమ్మ తన ఇద్దరు పిల్లలతో మళ్ళీ కాన్పు కోసం భీముని పట్నం వెళ్ళింది. రామమూర్తిని స్కూలు నుండి రాజావారి తమ్ముడు పద్మనారాయణదేవ్ గారికి ట్యూటర్ గా బదలాయించారు. వీరి స్థానంలో ఆ కళాశాల ప్రధానోపాధ్యాయుల తమ్ముడిని నియమించారు.

రాజావారి తమ్ముడికి రామమూర్తి మీాద చాలా ప్రేమ. ఆయన దగ్గర పెద్ద గ్రంథాలయం ఉండేది. బి. ఎ. లో చరిత్ర భాగం పాసు కావాలి కాబట్టి సూయల్ దొరగారి లిస్టుల మొదలు చరిత్ర మీాద వచ్చిన అన్ని పుస్తకాల్ని చదవటం కోసం రామమూర్తికి బర్నల్ దొరగారి 'సౌత్ ఇండియన్ పాలియోగ్రఫీ' పుస్తకాన్ని దొరగారు తెప్పించి ఇచ్చారు. శాసనాలు చదవటం నేర్చుకొన్నాడు. అటు అప్పారావుకీ, ఇటు రామమూర్తికీ కళింగ చరిత్ర మీాద ఆసక్తి పుట్టింది.

ఈ మధ్యలో ఒకటి రెండు చిన్న సంఘటనలు జరిగాయి. తనకి 12 సంవత్సరాల సర్వీసు ఉన్నా బి. ఎ. పూర్తికాలేదన్న నెపంతో తనకంటె వయసులో చిన్న వారిని తన పై అధికారులుగా నియమించటం రామమూర్తిగారికి ఇష్టం లేకపోయింది. ప్లీడరీ చదువుకోసం చెన్నపట్నం వెళ్తానని జీతం నష్టంపైన ఒక సంవత్సరం సెలవు ఇప్పించాలని కోరాడు. ప్రయాణానికి ఏర్పాట్లు కూడా పూర్తి అయ్యాయి. ఇదంతా 1892-93 లో జరిగిన విషయాలు.

ఇంతలో సంక్రాంతి వచ్చింది. పద్మనారాయణదేవ్ కి పాఠం చెబుతున్నాడు. పండుగనాడు కూడా పాఠం వదిలిపెట్టడం రామమూర్తికి అలవాటులో లేని పని. అంతలో రాజావారి సేవకులు నిప్పు కుంపటి, చురకలు వేసే శలాక పట్టుకు వచ్చారు. ఆస్థా

నంలో పనిచేసే వారందరికీ రెండు చురకలు వెయ్యాలని రాజాజ్ఞ అని విన్నవించుకున్నారు.

"ఇక్కడి రాజుల మరియాద చక్కగానే ఉన్నది. తక్కిన సంస్థానాలలో పండుగకు ఉద్యోగస్థులకు పంచెల చాపులో, పట్టు బట్టలో బహుమతిగా ఇస్తుంటే ఈ సంస్థానంలో వాతపెట్టడం సంప్రదాయంగా ఉన్నది! సెభాష్! చాలు మీ మర్యాద" అన్నారు రామ్మూర్తి. నారాయణదేవ్ సేవకుల్ని మందలించి వెళ్ళి పొమ్మన్నారట.

ఆ మరునటి రోజు (జనవరి 15, 1893) రామమూర్తి ముఖ లింగం క్షేత్రానికి వెళ్ళారు. ఆలయ క్షేత్ర పరిశోధనలు ఆంగ్లే యుల ద్వారా కంటె హిందువుల ద్వారానే బాగా జరుగుతాయని రామమూర్తిగారి అభిప్రాయం. హిందువులు గర్భగోపలలోకి వెళ్ళ వచ్చు గదా! అందులోనూ తాను పుట్టి పెరిగిన ప్రాంతం అవ డంతో ఎంతో అభినివేశంతో ముఖలింగంలోని మూడు ఆలయాలు తిరిగి 22 శాసనాల్ని రాసుకుని కళింగ దేశ చరిత్ర రహస్యాలు దొరికాయని సంతోష పడ్డాడు.

ఆనాటి ప్రజలు ఎంత అమాయకులో చూడండి. రామ మూర్తి ఆ శాసనాల్ని గడగడ చదువుతుంటే అందరూ ముక్కు మీద వేలు వేసుకొన్నారు. ఆ శాసనాల్ని దేవతలే రాశారని, మానవుల కర్థం కాని భాష అందులో వుందని స్థానికుల నమ్మకం.

పర్లాకిమిడి తిరిగి వచ్చి కుమార రాజాకి తన పరిశోధన ఎంత బాగా సాగిందో చెప్పాడు రామమూర్తి. ఆ మరునటి రోజున రాజా వారి సంస్థానంలో ఓ వింత జరిగింది. ఆ సంస్థానానికి ఒక జ్యోతిషశాస్త్రవేత్త వచ్చాడు. తాను త్రికాలవేదినని ఆయన రాజా వారితో విన్నవించుకొని సభ ఏర్పాటుచేసి తన విద్వత్తును పరీక్షించవలసిందని కోరాడు.

జాతక చక్రం చూస్తే చాలు. ఆ వ్యక్తి పుట్టిన తేదీ మాస సంవత్సరాలు గడగడా చెప్పేయగలడు. సభలోని వారంతా ఆశ్చర్యపడ్డారు. రామమూర్తికి జ్యోతిషంలో నమ్మకం లేదు. ఇప్పుడైనా వారికి నమ్మకం ఏర్పడి వుంటుందని ఒకరు సభలో అన్నారు. వెంటనే రామమూర్తిగారు "ఇంతవరకు ఈయన చెప్పింది ఖగోళ గణితమే తప్ప మరొకటి కాదు. నాకు నమ్మకం లేనిది జాతక ఫలాల్లోనే తప్ప గణితంలో కాదు" అన్నారు.

"నాకు గణితం అక్కరలేదు భగవంతుడిచ్చిన దివ్యజ్ఞానం వుంద"ని ఆ పండితులు కోతలు కోశారు. అయ్యా! అయితే మీరు జాతక చక్రం చూసిన వెంటనే చెప్పరెందుకు! అంకెలు కాగితం మీద వేసుకొని పావు గంటకు పైగా ఆ కాలక్షేపమేమిటి?" అని నిలదీశారు. సభ తెల్లమొగం వేసింది.

రాజా వారి తమ్ముడిని ప్లీడరీ చదివించటానికి మదరాసుకు పంపడానికి నిర్ణయించారు. రామమూర్తిని మరలా పాఠశాలకు బదిలీ చేశారు. అన్నపూర్ణమ్మకు మరో బాబు పుట్టాడు. సూర్య నారాయణ అని పేరు పెట్టారు.

మొత్తం మీద రామమూర్తి స్వతంత్రుడు - అనే అభిప్రాయం మాత్రం పర్లాకిమిడి జమీందారిలో అందరికీ తెలిసిపోయింది. అధికారం అంటే తలవంచేవాడుగా కనిపించటం లేదని పాఠశాల అధికార వర్గం నిర్ణయించక తప్పలేదు.

రామమూర్తికి ప్లీడర్ అయ్యే అవకాశం తప్పిపోవటంతో శ్రద్ధ మళ్ళీ తన పరిశోధనల వైపు మరలిపోయింది. దాదాపు సంవత్సరం పాటు విశాఖ, గంజాం జిల్లాల్లో తిరిగి సవరల విద్యాభివృద్ధి జరిగితే తప్ప వారిలో చైతన్యం రాదని విన్నవిస్తూ ప్రభుత్వానికి ఒక రిపోర్టు పంపాడు. ఈ రిపోర్టును గురించి వచ్చే అధ్యాయంలో చర్చిస్తాను. ముఖలింగం మీద తాను సేకరించిన విష

యాలలో ఒక పెద్ద వ్యాసం రాసి ప్రకటించాడు కూడా. ఈ రెండు పనులూ 1894 సెప్టెంబరు ప్రాంతానికి పూర్తి అయ్యాయి.

ఇక సవర భాషను నేర్చుకోవాలి. హిందూ సమాజంలో అంటరాని వారుగా హరిజనులు పరిగణించబడ్డట్టే సవరల్లో 'పానో' (పైడి) జాతి వా రున్నారు. 'తవుడు' అనే ఒక అబ్బాయిని ఇంట్లో తెచ్చి పెట్టుకుని తిండి గుడ్డల కొరత తీర్చి మచ్చిక చేసుకుని సవర భాషను నేర్చుకోవటం మొదలు పెట్టారు. అతనికి తెలుగు ఒరియా భాషలు కూడా రావటం వల్ల భాష సులభంగా నేర్పగలిగాడు. కాని ఆ భాష పరిశుద్ధంగా లేదని తెలియడానికి రామమూర్తికి ఎంతో కాలం పట్టలేదు. ఆ అడవి ప్రాంతాల దారులు బాగా తెలిసిన మామిడన్నం కుమారస్వామి పంతులు అనే మిత్రుడు పెద్ద వారి దగ్గర సవర భాషను నేర్చుకోవటం మంచిదని సూచించాడు.

మరి సవరలతో నేస్తం కట్టాలి. అది ఒక పెద్ద తతంగం.

మంచి రోజు చూసి నేస్తం కట్టదలచిన సవర కుండెడు తేనె, అరటి పండ్ల గెల, పసుపు కొమ్ములు, నాలుగు కొండ చీపుళ్ళ కట్ట, మండిగనిండా జొన్నలు, అల్లం, పొగాకు తీసుకుని రామమూర్తి గారింటికి వచ్చాడు. రామమూర్తి ఆదరంగా అతిథిని ఎదుర్కొని కుర్చీలో కూర్చోపెట్టారు. అత డిచ్చిన కానుకలు అందుకొన్నారు. ఒక ఎరుపు రంగు తలపాగాను, రెండు కమలా ఫలాలను, తవ్వెడు బియ్యాన్ని, పసుపు కొమ్మును, అల్లం ముక్కని, పానకాన్ని, రెండు పొగాకు చుట్టలను అతడికి కానుకగా ఇచ్చారు.

'*గడీజోన్, గడీనమ్*' (నా స్నేహితుడా! నీ స్నేహితుణ్ణి') అని ఇద్దరూ మూడుసార్లు అన్నారు. చీపురు పుల్లలు ఒకరి చేతి నుంచి మరొకరు తీసుకుని రెండేసి ముక్కలు చేసి పారవేశారు

అలా ఒక బ్రాహ్మణుడు సవర వాడుగా తాదాత్మ్యాన్ని పొందిన సంఘటన ఆ రోజుల్లో ఒక వింత విషయమే.

అలాగే పర్లాకిమిడి చుట్టూ వున్న హరిజన పాఠశాలలకి ఇన్స్పెక్షన్ కోసం ఎవరూ వెళ్ళడానికి ఇష్టపడని రోజుల్లో రామమూర్తి కోరుకుని మరీ వెళ్ళేవారు.

ఆ రోజుల్లో తెలుగు దేశంలో బ్రహ్మసమాజం - వీరేశలింగం పంతులు-అనే రెండు పేర్లు సుప్రసిద్ధమయినవి. అటు అప్పారావుగారూ, ఇటు రామమూర్తిగారూ బ్రహ్మసమాజం విలువల్ని అభిమానించారు. 'రీడింగ్ రూం' అనే పేరిట ఒక సాంస్కృతిక సంఘం పర్లాకిమిడిలో ఏర్పడింది. 1894 డిసెంబరు ప్రాంతంలో పర్లాకిమిడికి గవర్నర్‌గారు వచ్చారు సాంస్కృతిక సంఘం వారు గవర్నర్‌గారిని సన్మానించారు. సవరల విద్యాభివృద్ధికోసం ప్రభుత్వం వారు సవర దేశంలో బడులు పెట్టించాలని, దానికి రామమూర్తిగారు సహాయపడతారని సభవారు ప్రభుత్వాన్ని కోరారు. గవర్నర్ సుముఖుడుగానే వున్నా అప్పుడు కలెక్టరుగా వున్న మెకార్ట్నీ దొరగారికి ఇది ఇష్టంలేకపోయింది. జమీందారీకి కూడా ఈ పని అంతగా నచ్చలేదు. కట్టెలుకొట్టి జీవించే కొండవారికి చదు వెందుకని కలెక్టరు భావించాడు. రామమూర్తి ఒక పిచ్చివాడని, నెమ్మదిగా జీవిస్తున్న సవరలకు లేనిపోని ఆశలు కల్పించి విప్లవం లేవదీయాలని చూస్తున్నాడని గవర్నర్‌తో కలెక్టర్ పితూరీ పుట్టించాడు. రామమూర్తి ప్రయత్నం అలా ఆగిపోయింది.

1895 లో అంతవరకు హైస్కూలుగా మాత్రమే ఉన్న సంస్థ, సెకండరీ గ్రేడ్ కళాశాలగా పెంచబడింది. ఇక రామమూర్తి బి. ఏ. పూర్తి చెయ్యకపోతే మెట్రిక్యులేషన్ దాకానే పాఠాలు చెప్పాల్సి వస్తుంది. రాత్రింబవళ్ళు స్కూలు ఆవరణలోనే

చదువుతూ 1896 లో బి. ఏ. ను మొత్తం మదరాసు ప్రెసిడెన్సీలో రెండవ ర్యాంకులో ఫస్టుక్లాసుతో రామమూర్తి సాధించాడు. పర్లాకిమిడి ప్రజానీకం ఈ విజయాన్ని తమ ఊరికే గర్వకారణంగా భావించారు. జమీందారు కూడా రామమూర్తిని పిలిపించి తన సంతోషం వ్యక్తం చేశాడు. వెనువెంటనే కాలేజీలో ఎఫ్. ఎ. విద్యార్థులకు చరిత్ర బోధనకు అధ్యాపకులుగా నియామకం జరిగి పోయింది.

ఈ పనులు ఇలా జరుగుతున్నా ఒకవైపు సవర భాషా పరిశోధన మాత్రం ఆగలేదు. తమ ఇంటిదగ్గరే చాలా చోట్ల నుంచి సవర పిల్లల్ని రప్పించి తామూ మాళువా కొండల్లో తిరిగి సవర పాటలు, కథలు, తెలుగు లిపిలో రాసిపెట్టుకున్నారు. వారి ఆచార వ్యవహారాలను రికార్డు చేసుకోవటం మొదలుపెట్టారు. ఇలా ఒక నెల నిర్విరామంగా తిరిగేటప్పటికి మలేరియా జ్వరం పట్టుకుంది. ఆ రోజుల్లో తపాలాఫీసుల్లో క్వినైన్ గుండలు అమ్మేవారు. రోజుకు పది గ్రెయిన్లు చొప్పున ఒక నలభై రోజులు వరసగా పుచ్చుకునే సరికి చెవులు వినిపించడం మానేశాయి. దానికోసం ఎన్నో మందులు వాడాల్సి వచ్చింది. రాను రాను చెవుడు బ్రహ్మ చెవుడయింది కాని తగ్గలేదు. చెవిలో ఇనుప గొట్టం పెట్టి గట్టిగా అరవాల్సి వచ్చేది.

'ఈ మధ్యలో అప్పారావుగారు 'కన్యాశుల్కం' అనే నాటకం రాశాడు. 1892 లో అది విజయనగరం సంస్థానంలో మొదటిసారి ప్రదర్శించడమూ జరిగింది. కాని రామమూర్తి ఆ నాటకం ఇంకా చదవలేదు. 1897 లో మొదటి ప్రతి ముద్రణ పూర్తికాగానే విజయనగరం వెళ్ళినపుడు ఒక కాపీ తెచ్చుకుని మరీ చదివాడు.

తరువాత 5 సంవత్సరాలపాటు రామమూర్తిగారి కృషి

అంతా సవరలపైనే జరిగింది. తన జీతం డబ్బులు ఖర్చుపెట్టి పర్లాకిమిడికి దగ్గరగా ఉన్న సవర గ్రామాల్లో బడులుపెట్టి గ్రాంటుల కోసం ప్రయత్నించాడు. కాని ప్రభుత్వంలో కదలిక కనిపించటం లేదు.

ఇంతలో సీతాపతి ఎఫ్. ఎ. కి వచ్చాడు. మద్రాసు వెళ్ళి క్రిస్టియన్ కాలేజిలో బి. ఎ. చదవాలంటున్నాడు. ఇంతలో కాలేజీలో ఎస్మండ్ కల్లర్, టి. సి. ఆర్గిల్ అన్న ఇద్దరు ఇంగ్లీషు వారు చరిత్ర ఉపాధ్యాయులుగా చేరారు. వారికి రామమూర్తిగారి పరిశోధన చాలా నచ్చింది. కొత్తగా వచ్చిన కైలక్ అనే కలెక్టరుకి రామమూర్తి మీద ఎంతో గురి ఏర్పడింది. రామమూర్తి కృషి ఫలించడం మొదలయింది. ప్రభుత్వం ఆ బడులు ఎక్కడెక్కడ పెట్టాలో విద్యా విధానం ఎలా ఉండాలో చర్చించడానికి సభలు ఛత్రపురంలో పెట్టి రామమూర్తిని ఆహ్వానించారు.

ఇలా రెండు మూడేళ్లు గడిచాయి. సీతాపతి మద్రాసులో బి. ఎ. పూర్తిచేశాడు. 1907 లో రాజమండ్రిలో చేరి టీచర్స్ ట్రెయినింగు కూడా పూర్తిచేశాడు. పర్లాకిమిడి స్కూల్లో చరిత్ర మాష్టారయ్యాడు.

1908 లో రామమూర్తి సీతాపతితో పర్వతాల పేటకు వెళ్ళారు. వంశధారానదిని, తాను విక్రమదేవ వర్మతో ఆడిన చోట్లను చూసారు. తాను పుట్టిన నదిని చూసారు. సాష్టాంగ పడి నమస్కారం చేశారు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి' అని అందుకే అన్నారు. పర్లాకిమిడి తిరిగి వచ్చారు.

కొన్ని నెలలకే వెల్షమన్ అనే ఒక ఫారెస్టు ఉద్యోగి సవర ప్రాంతానికి వచ్చాడు. 'పారితోషికం ఇస్తాను. మీరు మా యింటికి వచ్చి సవర భాషను నేర్పండి' అని అడిగాడు.

రామమూర్తి అన్నారు: "మీ పారితోషికం నాకు అక్కర లేదు. మీ ఇంటికి నేను రాలేను. మధ్యాహ్నం విశ్రాంతి వేళల్లో మా కాలేజీకి రండి. ఒక గంట సేపు సవర భాషను నేర్పుతాను" అని.

వెల్ష్‌మన్‌కి ఇది నచ్చలేదు. తాను అధికారి నన్న గర్వం ఉండేది. కాని కొద్ది రోజులు రామమూర్తిగారి పాఠాలు వినగానే ఆయన అంటే ఏమిటో బోధపడ్డది. మెత్తబడ్డాడు. ప్రియ శిష్యుడయ్యాడు. సవరలతో మాట్లాడటం నేర్చుకున్నాడు. మ్యాన్ మైకేల్ అని ఒక కలెక్టరు వచ్చాడు. వెల్ష్‌మన్ ఆయనతో రామమూర్తిగారి సవర భాషా కృషిని గురించి చెప్పి మదరాసు ప్రభుత్వ ముద్రణాలయం తెలుగు-సవర నిఘంటువు, కథలు, పాటలు అచ్చు వేసేలా సహాయం చేశాడు.

ఈ మధ్యలో రామమూర్తిగారికి మరొకరితో పరిచయం మొదలైంది. ఆయన జె. ఏ. ఏట్స్. స్కూళ్ళ ఇన్స్‌పెక్టర్. వీరి మైత్రి చిరకాలం సాగింది. ప్రత్యక్ష పద్ధతిలో, ధ్వని లిపిలో పిల్లలకు ఇంగ్లీషు నేర్పటం మంచిదని ఏట్స్ చేసిన ప్రబోధం రామమూర్తిగారిని కూడా ఆకర్షించింది. పర్లాకిమిడి పాఠశాలలో ఈ పద్ధతిలో నేర్పడానికి సీతాపతి తగినవాడని రామమూర్తి సూచించారు.

ఏట్స్, అప్పారావు, పి. టి. శ్రీనివాసయ్యంగార్ అనే ఒక ప్రిన్సిపాలుగారితో కలిసి, రామమూర్తిని ఒక ఉద్యమ నాయకుడుగా తీర్చారు. అదే వ్యావహారిక భాషా ఉద్యమ మనే పేరిట 1910 నుంచి 1914 దాకా సాగింది.

1911 లో 30 ఏళ్ళ సర్వీసు పూర్తి అయినందువల్ల రామమూర్తిగారు రిటైర్ అయ్యారు. వయస్సు 48 సంవత్సరాలే. అప్పటికే ఆయన పేరు సవర సమాజోద్ధారకుడుగా ప్రభుత్వ

పరిగణనలోకి వెళ్ళింది. ఇంతలో 1910 జూలై నెలలో జయపూర్ హైస్కూలుకి ప్రధానోపాధ్యాయుడుగా వెళ్ళిన సీతాపతి ఇక్కడ తండ్రి పదవి ఖాళీ పడగానే తిరిగి వచ్చాడు. తండ్రి స్థానం ఆక్రమించాడు.

తన ఉద్యోగ బాధ్యతలతో క్షణం తీరికలేని సీతాపతి తండ్రిగారి దగ్గర అప్పటి కింకా సవర భాష నేర్చుకోలేదు. సవర పుస్తకాలు అచ్చవుతున్నాయి. ప్రూఫులు చూసే పని సీతాపతికే అప్పజెప్పారు. ఈ పుస్తకాలు రచించినందుకు మీకు ఏం ప్రతి ఫలం కావాలని ప్రభుత్వం అడిగింది. "నాకు ఏమీ అక్కరలేదు! మీరు సవర పిల్లలకి బళ్ళు తెరవండి విద్యావంతుల్ని చెయ్యండి. అంతే చాలు" అని రామమూర్తి పంతులుగారు బదులు రాశారు అయినా బ్రిటిష్ ప్రభుత్వం విద్యావంతుల్ని తప్పనిసరిగా గౌరవించేది. 1911 వ సంవత్సరం నవంబరు 12 వ తేదీన జార్జి చక్రవర్తి రాజ్యాభిషేకోత్సవం సందర్భంగా గిడుగు వారికి 'సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్' ఇచ్చారు.

1906 లో తొలిసారిగా ఏట్సుతో పరిచయం అయినప్పటినుంచి గిడుగువారి శ్రద్ధ తెలుగు భాషాసాహిత్యాల వైపు ప్రసరించడం మొదలు పెట్టింది. 1908-1910 ల నడుమ ఉపాధ్యాయ సదస్సుల్లో భాషా పరిణామాన్ని గురించి మాట్లాడినప్పటి నుంచి పంతులు గారికి ప్రాచీన తెలుగు భాషాసాహిత్య పరిణామాలను క్షుణ్ణంగా చదవాలని నిర్ణయించుకొన్నారు. అప్పారావుగారిద్వారా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిచయ మయ్యారు ఆయన అప్పటికే సుప్రసిద్ధ సాహిత్యమూర్తి. ఆయన ద్వారా గిడుగు గురజాడ లిద్దరికీ ప్రాచీన వచన గ్రంథాలలో వ్యాఖ్యానాలలో కేవలం వాడుక భాషే వాడబడేదని, చిన్నయసూరి అనే మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీ పండితుడి ప్రభావంతో ఆ వ్యాఖ్య లన్నింటిని కావ్య భాష

లోకి మార్చివేస్తున్నారని తెలిసింది. అప్పారావు తన 'కన్యాశుల్కం' నాటకాన్ని పూర్తిగా వ్యావహారికంలోకి మార్చి 1910 లో ప్రచురించాడు కూడా.

1913 లో వెల్షమన్ చేసిన ప్రయత్నాలు ఫలించి 'సెరంగో' అనే చోట సవర పాఠశాల ఒకటి ప్రారంభించారు. అక్కడ సవర భాషలో ట్రెయినింగ్ ఇవ్వడం ఉపాధ్యాయుల్ని తయారు చెయ్యటం ప్రధాన ధ్యేయం. ఇంతలో వెల్షమన్ ఇంగ్లాండుకు వెళ్ళాల్సి వచ్చింది. మొదట ప్రపంచ యుద్ధంలో అతణ్ణి 'రిక్రూట్' చేశారు. సవర స్కూలు బాధ్యతను రామమూర్తి సీతాపతులే నిర్వహించారు.

ఈ మధ్యలో రామమూర్తికి భాషా విజ్ఞానంలో కొత్త మార్గాలు తెలిశాయి. 1912 లో కొడుకుతో కలిసి మద్రాసు యూనివర్సిటీ ఏర్పాటు చేసిన 'డేనియల్ జోన్స్' ఉపన్యాసాన్ని విన్న తరువాత ధ్వని లిపిలో తాను తయారవటం మాత్రమే కాకుండా సీతాపతిని, తన విద్యార్థులను కూడా తయారు చేశాడు. జోన్స్ కోరికపైన ధ్వని లిపిలో 'తెలుగు రీడర్'ని తయారు చేసి ఇంగ్లాండుకి 1913 లో పంపాడు కూడా. జనవరి 1 తేదీన రామమూర్తిగారికి మరొక గౌరవం కూడా లభించింది. ప్రభుత్వం వారు 'రావు సాహెబ్' అనే అపూర్వమైన బిరుదును పంతులు గారికి ఇచ్చారు.

మరి ఇక పంతులుగారు చాలా ఎత్తుకు ఎదిగిపోయారు. ఒక వైపు తెలుగు దేశంలోని పండితులంతా వ్యావహారికానికి వ్యతిరేకంగా 'గ్రాంధికోద్యమం' నిర్వహిస్తున్నారు. తాను ఊరుకోవడానికి వీల్లేదు, అంచేత ప్రాచీన గ్రంథాల భాషను ఆపోసనపట్టి అదే కృతక శైలిలో 'ప్రాదెనుఁగుఁగమ్మ' అనే ఒక గ్రంథాన్ని ఏప్రిల్ 31 (1913) న తయారు చేసి ప్రకటించాడు. ఆంగ్లంలో

'ఏ మెమొరాండం ఆన్ మాడర్న్ తెలుగు ప్రోజ్' అనే గ్రంథాన్ని కూడా రాశారు.

పంతులుగారి కీర్తి విన్న విజయనగరం సంస్థానం వారు వారి పిల్లలకు ఇంగ్లీషు నేర్పడానికి రమ్మని అప్పారావు ద్వారా కబురు పంపారు. ఇష్టం లేకపోయినా వెళ్ళాడు. కాని ఒక సంవత్సరం కన్నా అక్కడ పని చెయ్యలేక పోయాడు. 1914 లో పర్లాకిమిడి తిరిగి వచ్చాడు.

ఒక వైపు వ్యావహారికోద్యమం బలపడుతోంది అప్పారావు గారు 'డిసెంటు పత్రం' అనే ఒక గ్రంథాన్ని 1914 లో ప్రకటించి పండితుల నోళ్ళు నొక్కుతున్న సమయం. రామమూర్తిగారూ 'నిజమైన సంప్రదాయం' అనే మరో గ్రంథాన్ని ప్రచురించారు.

అంతలో ఒక దుర్వార్త తెలిసింది. అప్పారావుగారి ఆరోగ్యం దెబ్బ తిన్నదని. విశాఖపట్టణం ఆసుపత్రిలో చేరిన అప్పారావుగారిని పరామర్శించటానికి రెండు మూడుసార్లు వెళ్ళారు. 'నేను మరణించినా నువ్వు మాత్రం మన ఉద్యమాన్ని నిలపకు' అంటూ అప్పారావు మిత్రుణ్ణి ఆదేశించాడు. అప్పారావు 1915 లో (నవంబరు 30) పోవటంతో రామమూర్తి ఒంటరి వాడయ్యాడు.

కాని మిత్రుడికి ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలి. యువ రచయితలు, విద్యార్థులు చూపుతున్న ఉత్సాహం అగ్రశ్రేణిలో ఉన్న పండితుల్లో కనిపించటం లేదు. అందుచేత కొవ్వూరులో జరిగిన పండిత సదస్సులో (1916) రామమూర్తి జీవభాషా విస్తరణను గురించి వాదించారు. ఆ సభలోనే వుండి మూలం నుండి ఆ ఉపన్యాసం విన్న కందుకూరి వీరేశలింగం గారిలో కూడా పరివర్తన వచ్చింది.

1917 లో పంతులుగారు మరొక శ్రేయోభిలాషిని కోల్పోయారు. వెల్షమన్ ప్రపంచయుద్ధంలో చనిపోయాడు. పండితులలో కూడా మార్పు కనిపిస్తోంది. తనకు ఒక పత్రిక ఉంటే తప్ప తన భావాల్ని ప్రచారం చెయ్యటానికి వీలుకాదని పంతులుగారు గుర్తించారు. 1919 లో 'తెలుగు' అనే పత్రికను ప్రారంభించారు. తెలుగు భాషా సాహిత్యాలను ఆధునికం, శాస్త్రీయం చెయ్యటానికి ఎన్నో పథకాల్ని ఆయన ప్రారంభ సంచికలో సూచించారు. ఒక సంవత్సరం మాత్రం పత్రిక నడిచింది కాని, చందాదార్లు సరిగా పంపక ఆగిపోక తప్పలేదు. తనకున్న చిన్ని ఆదాయంలో పంతులుగారు ఆ పత్రికను ఎలా నడపగలరు!

1919 లో 'సాహితీ సమితి' అన్న ఒక సాహిత్య సంస్థను యువకులు కొందరు ప్రారంభించారు. పంతులుగారిని గౌరవ సభ్యులుగా చేసుకున్నారు. అదే ఏడాది వీరేశలింగంగారు చనిపోయారు కూడా.

1920-28 ల నడుమ ఒక వైపు సవర భాషమీద అధ్యయనం చేస్తున్నా ఆ పని అట్టే సాగినట్టులేదు. మిత్రులకు రాసిన వుత్తరాల్నిబట్టి ఆయన తెలుగుభాషా సాహిత్యాలమీద ఎక్కువ కృషి సాగించినట్టు తెలుస్తోంది. ప్రతి పక్షులతో పత్రికలలో వివాదాలు, వ్రాత ప్రతుల సంపాదన, మూలపాఠాల పరిష్కారం, ప్రాచీనకాలంలో తెలుగు వచన రచనకు సంబంధించిన ఆధారాల సేకరణ-ఇవే పంతులుగారు సీతాపతిగారి సాయంతో చేస్తున్నట్టుంది.

1914 లో మొదలు పెట్టిన దేశసంచారం మాత్రం నానాటికీ ఎక్కువయింది. 1924 లో విజయనగరం కళాశాలకు ఉపన్యాసం ఇవ్వడానికి పంతులుగారు వచ్చారట. టేకుమళ్ళ కామేశ్వరరావు

గారు అప్పు డక్కడ విద్యార్థి. పంతులుగారు ఎలా దర్శన మిచ్చారో ఆయన ఇలా వర్ణించారు :

"పంతులుగారు సామాన్యం ఎత్తు. ఇది గిడుగు కాదు పిడుగు అన్నట్టుగా ఉంటారు. ఆయనకుండే పట్టుదల అంతా మొహంలోనే కనిపిస్తుంది. ఎరుపుఛాయ, తలపాగా, కోటు, పంచ అన్నీ తెల్లటివే ధరించేరు. వారు ఉపన్యాసంలో మధ్య మధ్యలో గట్టిగా కేకలు వేస్తూ వచ్చేరు. భాషా విషయంలో వారి ఉద్రేకం పట్టరానిది. ఆ ఉపన్యాసంలో నాకు బోధపడినది అంతే."

నిజమే మరి! పంతులుగారేమో జనసామాన్యాన్ని దృష్టిలో వుంచుకొని మాట్లాడుతారు. పండితులకు శాస్త్రాలు కావాలి. వారి యన్ని 'గ్రామ్యాచార్యులు' అంటారు ఈయనకి కోపం తలకెక్కుతుంది. అలా సాగేవి వారి ఉపన్యాసాలు.

ఈ మధ్యలో సీతాపతిగారు తండ్రికి భిన్నమైన మార్గం తొక్కటం ప్రారంభించాడు. అతనికేమో కవిత్వం అల్లటం ఇష్టం. రామమూర్తికి ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో కూడా భాషా పరిశోధన తప్ప మరొకటి వుండదు. ఉండకపోవటమే కాదు. వేరే పని తన వారు చెయ్యటమూ ఆయనకు సుతరామూ గిట్టదు. ఒక రోజు పిల్చి ఇలా అన్నారు :

"ఆ కవిత్వం రాయటానికి చాలామంది ఉన్నారు. కాని లక్షలమంది ప్రజలకు పనికి వచ్చే ఈ పని (భాషాకృషి) ఛూశావూ! అందరూ చెయ్యలేరు. నాతో సహకరించు" అని.

కొడుకు ఎంతవరకు విన్నాడో వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి 7-3-24 న రాసిన వుత్తరం నుండి తెలుస్తోంది.

"...చి॥ సీతాపతిని నా పనికి ఉపయోగించుకోలేదు. నవలో నాటకమో, పాటో పదమో వాడి కిష్టమయినది వాడు

వ్రాయవచ్చును. రచించుటకు పూనుకొమ్మని ఇదివరకే చెప్పినాను. అయితే వాడికి తీరిక తక్కువ. మ్యునిసిపాలిటీ పనులు, కో ఆపరేటివ్ బ్యాంకి పనులు చేసి, చదరంగమాడి కాని, వీణవాయించి కాని విశ్రాంతి పొందుతాడు.''

అంతే కాదు. చదువు రాకపోతే పిల్లల్ని చావబాదటం పంతులుగారి పద్ధతి. కాని అది తప్పని సీతాపతి మార్గం. ఇలా రెండు దారుల్లో ఉన్న తండ్రీ కొడుకుల్ని కలిపింది మిస్ మన్రో.

ఆమె 1928 లో 'మిషనరీ' (మత బోధకురాలు)గా సవర కొండలలో పని చెయ్యటానికి వచ్చింది. ఆమె చాలా ఉన్నతమైన వ్యక్తి. సవరల మీద ప్రేమతో వారిని నాగరికులుగా చెయ్యాలని ఆమె కోరిక. అలాంటి ఆవిడకి భాష నేర్పాలి. ఇలాగైనా దారిలో పడతాడని సీతాపతికి ఆరు నెలల్లో తాను మూడు దశాబ్దాలపాటు నేర్చుకొన్న సవర భాషాతత్త్వాన్ని బోధించారు. సెరంగోలో మూతపడిన పాఠశాలను మళ్ళీ ప్రారంభించారు. పంతులుగారు దానికి 'వెల్ష్‌మన్ సవర ట్రైనింగ్ ఇన్స్టిట్యూట్' అని పేరు పెట్టారు.

ఇలా మన్రో రాకతో మళ్ళీ గిడుగువారు 'సవర పరిశోధనలో' పడ్డారు. ధ్వని లిపిలో, భాషా నిర్మాణ దృష్టితో, సాంస్కృతికమైన నేపథ్యంతో, రామమూర్తిగారు 1931 లో 'మాన్యువల్ ఆఫ్ సొర లాంగ్వేజ్' అన్న అద్భుతమైన గ్రంథాన్ని ప్రచురించారు. ప్రభుత్వం అచ్చువేసింది. మన్రో కార్యదీక్షకు ఆశ్చర్యపడిన పంతులుగారు ఆ గ్రంథాన్ని ఆమెకే అంకితం చేశారు. ఇలా మొదలయిన సవర భాషా కృషి మరి రెండేళ్ళు సాగింది. 'ఇంగ్లీషు - సొర నిఘంటువు' 1933 లో తయారయింది.

రామమూర్తిగారి సాంఘిక సేవకు గుర్తింపుగా ఆ రోజుల్లో అత్యంత ప్రతిష్ఠాత్మకమైన బహుమతిగా భావించబడిన 'కైజర్-ఇ-

హింద్' సువర్ణ పతకం 1-1-33 న పంతులుగారికి ప్రభుత్వం ఇచ్చింది.

పంతులుగారు ఇంత నిర్విరామ సంగ్రామంలో ఉండగానే 70 సంవత్సరాలు నిండాయి. దేశమంతటా శిష్యప్రశిష్యులే. ఎన్నో పత్రికలు రామమూర్తిగారికి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిని సృష్టించాలని కూడా రాయడం మొదలుపెట్టాయి. ఈ పరిస్థితుల్లో తెలికిచెర్ల వెంకటరత్నంగారి నేతృత్వంలో రాజమండ్రిలో 1933 డిసెంబరు 27, 28, 29 తేదీల్లో మహావైభవంగా పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవాలు జరిగాయి. పంతులుగారు రచించిన బాలకవి శరణ్యం, ఆంధ్ర పండితభిషక్కుల భాషాభేషజం, గద్య చింతామణి, వ్యాసావళి అనే గ్రంథాలు ఆ సభల్లో ఆవిష్కరించబడ్డాయి. మహాకవి రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షోపన్యాసం చేశారు. సుప్రసిద్ధ రచయితలంతా రాసిన 'వ్యాస సంగ్రహం' అనే వ్యాస సంపుటి కూడా ప్రచురించబడింది.

ఈ విజయోత్సవం పూర్తిచేసుకొని పర్లాకిమిడి తిరిగి వెళ్ళగానే పంతులుగారికి కష్టాలు మొదలయ్యాయి. అప్పటికి రెండేళ్ళ క్రితమే పర్లాకిమిడి జమీందారులలో తగాదా మొదలయింది. అది చిలికి చిలికి గాలి వానైంది. 1931 లో ఒడొనెల్ కమిటీ వచ్చింది. పర్లాకిమిడి ఒరిస్సాలో చేరాలా! ఆంధ్రలో ఉండాలా! అన్నది సమస్య. ప్రజలందరూ తెలుగు మాట్లాడేవారే. జమీందారులకు మాత్రం ఓఢ్రులలో కలవాలని వుంది. ప్రజలు వ్యతిరేక పక్షంగా వున్నారు. ఒడొనెల్ కమిటీ ముందు పంతులుగారు తాము చేసిన పరిశోధనల సారాంశాన్ని చెప్పి గంగ వంశపు రాజులు ఓఢ్రులు కారని, అంచేత పర్లాకిమిడి, బరంపురం ప్రాంతాలు ఆంధ్రకే చేరాలని వాదించారు.

ఎస్టేట్ వారికిది భరించరాని విషయం అయింది. మంద లింపులకి పంతులుగారు లొంగేవాడు కాడు. అంచేత సీతాపతిని 1932 ఫిబ్రవరిలో ఉద్యోగం నుంచి తొలగించారు. గిడుగు వారి కుటుంబం ఆర్థికంగా చిక్కుల్లో పడింది. అయినా తండ్రీ కొడుకులు చలించే వారు కాదు.

ఇంతలో పర్లాకిమిడి తాలూకా బోర్డు ఏర్పడింది. మ్యునిసిపల్ కౌన్సిల్‌ని తమ వశం చేసుకొని రాజావారు పర్లాకిమిడిని ఒరిస్సాలో భాగం చెయ్యాలని నిశ్చయించుకొని ఉండటంవల్ల ప్రజల కోరికకు వ్యతిరేకంగా ప్రతి ఫిర్కాలోనూ తాలూకా బోర్డు మెంబర్ల ఎన్నికల విషయంలో చాలా జాగ్రత్త పడ్డాడు. రామమూర్తిగారు సీతాపతి రాజకీయ నాయకులు కావాల్సి వచ్చింది. ప్రతిచోట తెలుగు రైతుల్ని నిలబెట్టారు.

ఎన్నికల్లో తెలుగు వారే గెలిచారు. సీతాపతి తాలూకా బోర్డు అధ్యక్షుడయ్యాడు. పర్లాకిమిడి తెలుగు దేశానికే చెందాలన్న ప్రజల కోరిక నెగ్గింది. ఒడొనెల్‌గారూ దీన్ని అంగీకరించారు. కాని లండన్‌లోని జాయింట్ పార్లమెంటు కమిటీ ఆమోదిస్తే తప్ప ఈ విషయం అమలులోకి రాదు. అప్పుడు పంతులుగారు చందాలు పోగుచేసి పైగా సొంత డబ్బును వేసి కొడుకుని లండన్‌కి పంపాడు. పంతులుగారికి కొడుకు మీాద ఎంత ప్రేమ ఉన్నా ఇలా శాసించారు

"ఆంధ్రుల యెడనుగాని, నిన్ను నమ్మి తమకు ప్రతినిధిగా లండన్ పంపుతున్న వారి యెడలను గాని నీవు ద్రోహివి కానేరవన్న నమ్మకం నాకు లేకపోలేదు. అయినా చెప్తున్నాను; నీవు పరుల మాయ మాటలకు మోసపోవద్దు. జాగ్రత్త."

సీతాపతి కార్యాన్ని సాధించుకు వచ్చాడు. కాని రాజావారు మళ్ళీ లండన్‌కి పోయి పలుకుబడిని ధనాన్ని ఖర్చుపెట్టి పర్లా

కిమిడి దాని చుట్టూ ఉన్న గ్రామాలు ఒరిస్సాలో చేరేట్టుగా అను మతి సంపాదించాడు. ఎలాగైనా సుమారు 400 గ్రామాలు మాత్రం తెలుగు దేశానికే దక్కాయి. ఇది పాక్షిక విజయమే ఐనా తండ్రీ కొడుకుల్ని కుంగదీసింది.

'సీతాపతి మీావల్లే చెడిపోయాం' అని అన్నపూర్ణమ్మగారు సాధించటం మొదలుపెట్టారు. సీతాపతి తన కుటుంబంతో మద్రాసుకు వెళ్ళిపోయాడు. చిన్న అబ్బాయికి రాజమండ్రిలో ఉద్యోగం దొరికింది. ఇలా ఒక్కొక్కరే తమ దారులు చూసుకోగా పంతులుగారు, అన్నపూర్ణమ్మ మాత్రం మిగిలారు.

1934 లో పంతులుగారిని 'భారతీ తీర్థసభ' వారు పిలిచారు. 'మహా మహోపాధ్యాయ' బిరుదు నిచ్చి గౌరవించారు. ఒక వైపు సవర ఇంగ్లీషు నిఘంటువు ముద్రణ సాగుతోంది. ప్రూఫులు చూసి పంపాలి. మరోవైపు సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనం సాగుతోంది. ఇంకోవైపు శబ్దరత్నాకరం నిఘంటువుని చీల్చి చెండాడుతున్నాడు.

ఈ స్థితిలో 6-5-1935 న పంతులుగారికి ప్రభుత్వం 'రజతోత్సవ సువర్ణ పతకాన్ని' ప్రసాదించింది. వచ్చినవి తీసుకోక పోవటం లేదు కాని ఇది రావాలని కోరుకోవటం పంతులుగారికి తెలియదు.

కాని జమీాందారులకి పంతులుగారి మీాద కక్ష పెరిగి పోయింది. దాదాపు ఊరంతా వెలివేసినంత పనిచేశారు. తాపీ పని వాడు కాని, పెంకు లమ్మేవాడు కాని, మంగలి కాని పంతులు గారింట్లో పనిచెయ్యరాదని ఆంక్ష పెట్టారు. ఊరిలోని పెద్ద మనుష్యు లెవరూ పంతులుగారితో మాట్లాడటం కూడా మాని వేశారు. ఒకప్పుడు ఆ వూరికి ఘనకీర్తి సంపాయించిపెట్టిన పంతులు గారిని పర్లాకిమిడి అలా సన్మానించింది.

ఇలా 5, 6 నెలలు గడిచాయి. ఉద్యోగ విరమణ చేశాక పంతులుగారు చేసిన గొప్ప పని ఒక సొంత ఇల్లు కట్టుకోవడం. పైన తన చదువుకోసం రెండు గదులు వేసుకున్నాడు. ఆ గదుల్లోని గ్రంథాలే తన సర్వస్వంగా రామమూర్తి గడిపాడు.

ఆ రోజు నవంబరు 23 శనివారం. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పర్లాకిమిడికి వెళ్ళి 36 గంటలసేపు పంతులుగారితో గడిపారు. శాస్త్రిగారు అలసిపోయినా పంతులుగారు నవయువకు డిలా మాట్లాడుతూనే ఉన్నారు. ఆయన తాము పడుతున్న బాధలు చెప్పి ఇలా అన్నారట :

"1936 ఏప్రిల్‌లో ఓఢ్రరాష్ట్రం ఏర్పడుతుందంటున్నారు. కొన్ని గడియలకు ఓఢ్రరాష్ట్రీయచ్ఛాయ అలముకుంటుందనగా నేను పర్లాకిమిడి విడిచిపెట్టి మద్రాసు ప్రెసిడెన్సీలోకి వచ్చేస్తాను. అయితే పర్లాకిమిడి స్టేషనులో రైలెక్కను. పాతపట్నం వెళ్ళి ఏటిలో స్నానంచేసి, పర్లాకిమిడి మళ్ళీ మద్రాసు ప్రెసిడెన్సీలో చేరితే తప్ప లేకపోతే ఆ వూళ్ళో—బ్రతికి ఉండగా నేనా ఊళ్ళో అడుగుపెట్టనని కంకణం కట్టుకుని రైలెక్కుతాను. అయితే రైలెక్కి ఏ వూరు వెళ్ళడం? ఈ వృద్ధాప్యంలో నా కెక్కడ సుఖంగా ఉంటుంది?" శాస్త్రిగారి గుండె కరిగిపోయింది.

పంతులుగారికి చరిత్ర సత్యాల మీద ఎంత నిబద్ధ స్పృహ! ఎంత భాషాభిమానం తన సిద్ధాంతం కోసం తాను సంపాయించిన ఆస్తినంతా వదలి నిజంగానూ అన్నంత పనీ చేసి రాజమండ్రిలో కొడుకు దగ్గరికి గిడుగు భార్యతో చేరారు.

రాజమండ్రి నివాసం పంతులుగారికి కొంత గుండె బరువును తగ్గించింది. మన కళ్ళకి ఇంగ్లీషు తెలుగు నేర్పటం నిత్యకృత్యం. ఎంతోమంది కవులు, రచయితలు, విమర్శకులు పంతులుగారిని

రోజూ కలుసుకునేవారు. 1938 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం పంతులుగారికి 'కళాప్రపూర్ణ' బిరుదును కూడా యిచ్చింది.

1934 లో పెద్ద కొడుకుతో వచ్చిన ఎడబాటు అలాగే కొనసాగింది. ఆయనకు కొడుకూ రాయలేదు. కొడుక్కి ఆయనా రాయలేదు. 1938 లోనే పంతులుగారి 'సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శన' ప్రచురణ పొందింది కూడా.

కొడుకు ఇల్లు చిన్నది. తాను చాలా పుస్తకాల్ని, తన డైరీలను, వేలకొద్దీ ఉత్తరాలను, వ్రాత ప్రతుల్ని, అక్కడే వది లేసి వచ్చినా ఇల్లు చాలకుండా వుంది. చివరి రోజుల్లో పంతులు గారు అంత సుఖంగా బ్రతకలేదనే చెప్పాలి.

దీనికి తోడుగా పంతులుగారికి మూత్రకోశాలకు సంబంధిం చిన వ్యాధి మొదలయింది. వయసేమో పైబడుతోంది. కాకపోతే తాను ప్రారంభించిన ఉద్యమం విజయవంతమైంది. ఇక గ్రాంథికాన్ని గురించి మాట్లాడే పండితుడు లేడన్న ధీమా ఏర్పడి అదొక సంతోషం మిగిలింది. 'కృతక గ్రాంథికాంధ్ర విజృంభణం' అనే గ్రంథం పూర్తి చెయ్యాలి. శబ్దరత్నాకరాన్ని సంస్కరించి విమర్శించి పునః సృష్టించాలి. ఇవి మిగిలిన ఆశయాలు.

వీటినీ సాధించాలని వుంది. కాని ఓపిక తగ్గిపోయింది. జ్ఞాపక శక్తి సన్నగిల్లుతోంది. ఏం తిన్నా జీర్ణంకాక ఎక్కిళ్ళ రూపంలో అంతా వాంతికి రావటం మొదలయింది. రాజమండ్రిలో డాక్టర్లు మదరాసుకు వెళ్ళి పెద్దాసుపత్రులలో చికిత్స పొందాలన్నారు అన్నపూర్ణమ్మ అబ్బాయికి రాద్దామంది. పంతులుగారు 'గుర్రు' మని చూశారు.

పంతులుగారి మేనల్లుడు కాళ్ళకూరి సూర్యనారాయణగారు పచ్చయప్ప కళాశాలలో కెమిస్ట్రీ ప్రొఫెసరుగా వుండేవారు ఆయనకి పంతులుగారు జాబు రాశారు వస్తున్నామని. అన్న

పూర్ణమ్మ తోడుగా బయలుదేరింది. ఈ వార్త తెలిసిన సీతాపతికి తొలిసారిగా 'పశ్చాత్తాపం' అంటే ఏమిటో తెలిసింది. సూర్య నారాయణగారితోపాటు ఆయన స్టేషన్‌కి వచ్చారు.

జనవరి 4 (1940) న తండ్రీ కొడుకులు మళ్ళీ ఒక గూటిలో చేరారు. తల్లికి సంతోషమయింది. పంతులుగారికీ సంతోషమే. కాని బయటపెట్టే వ్యక్తి కాదు. తన ఆరోగ్యం ఎలాగూ బాగు కాదని పంతులుగారికి తెలిసిపోయింది. అయినా దేహాన్ని కాపాడు కోవాలి! కె. నారాయణమూర్తి గారన్న పేరున్న డాక్టరు వైద్యం చేశారు. ఒక రోజు అలా మరో రోజు ఇలా దేహస్థితి మారు తోంది. అజీర్తి మాత్రం ఓ మోస్తరుగా కుదిరింది.

పంతులుగారు ఒక రోజున కొడుకుని చేర బిలిచి "ఎక్క డైనా ఒక సభ ఏర్పాటు చేస్తావా! ఉపన్యసిస్తాను" అన్నారు, దేహ స్థితి చూస్తే దారుణంగా వుంది. కాని ఉత్సాహం పట్టుదల మాత్రం ఇసుమంత కూడా తగ్గలేదు. అంచేత ఉపన్యాసం ఇవ్వటం వల్ల కలిగే శ్రమకంటె ఇవ్వకపోవటం వల్ల కలిగే దుఃఖం నాన్న గారిని ఎక్కువ బాధిస్తుందని తెలిసిన సీతాపతిగారు చెన్నపురి ఆంధ్ర మహాసభ వారితోను, గూడవల్లి రామబ్రహ్మంగారితోనూ మాట్లాడారు.

పెద్ద సభలో ప్రసంగిస్తే ఆయాసం ఎక్కువవుతుందని తను 'ప్రజామిత్ర' ఆఫీసులో 15-1-40 న సభ ఏర్పాటు చేశారు. తా మిక ఈ లోకం నుంచీ వెళ్ళిపోవాల్సిన సమయం ఆసన్న మైనందువల్ల తమ కట్టకడపటి సందేశం తెలుగు పత్రికల సంపాద కులు రచయితలు వినాల్సిందని 'తుది విన్నపం' చేశారు.

"...యూనివెర్సిటీలున్ను, ప్రభుత్వ విద్యాశాఖవారున్ను మాత్రం ఇంకా అనుగ్రహించలేదు. 25 సంవత్సరముల క్రిందట ఈ రెండు సంస్థల వారున్ను వాడుక భాషను గ్రహించవలెనని

చూచి నప్పుడు, నా వాదం తెలుగువారు గ్రహించకపోవడం చేతను అలజడి ఎక్కువయినది. అందుచేత ఆ సంస్థల వారు దానిని గ్రహించలేదు. ఇప్పుడు తెలుగు వారు నా వాదం గ్రహించినారు గనక, ఆ సంస్థల వారు గ్రహించి ఆమోదించేటట్లున్నూ, ఆచరణలో పెట్టేటట్లున్నూ చేయవలసిన భారం మీది. ఈ పని మీకు అప్ప గించి నేను విరమిస్తున్నాను - సెలవు.''

నిజంగానూ ఇదే వారి తుది విన్నపం అయింది. 17 వ తేదీ పంతులుగారు తండ్రిగారి ఆబ్దికం జరిపారు. సీతాపతిగారిని కూడా స్నానంచేసి తమ చెంత ఉండా లన్నారు. ''66 వ సారి మాతండ్రి గారి తద్దినం పెడుతున్నాను. ఇదే కడపటిసారి కాబోలును'' అన్నారు. అంటే ఇక ఈ బాధ్యత నీకు అప్పజెపుతున్నా నని కొడుక్కి సూచించారన్నమాట. సీతాపతిగారికి కళ్ళలో నీళ్ళు తిరి గాయి.

ఆ తర్వాత రెండు మూడు రోజులకు రామమూర్తిగారి ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. ఆబ్దికం నాటి అపథ్య భోజనం వల్లనే రోగం తిరగబడిందని డాక్టరన్నారు. తిన్నది కాని తాగింది కాని లోపల ఇమడక ఊపిరాడక యాతనపడి 21 న రాత్రంతా కాలపురుషుడితో పోరాడి 22 న ఉదయం 7-20 కి పంతులుగారు భౌతిక కాయాన్ని వదలిపెట్టారు.

రామబ్రహ్మంగారు సీతాపతిని ఓదార్చి జరపాల్సిన కర్మ కాండను దగ్గరుండి జరిపించారు. అడయార్ శ్మశాన వాటికలో మదరాసులోని ప్రముఖులంతా నివాళులు అర్పించారు.

పత్రికలన్నీ ఆయన మరణానికి ప్రముఖులు వెలిబుచ్చిన సంతాప సందేశాల్ని ప్రకటించాయి. నవ్యసాహిత్య పరిషత్తు అదే సంవత్సరంలో 'ప్రతిభ' (4 వ సంపుటి) ను గిడుగు వారి పేరిట అద్భుతమైన వ్యాసాలతో ప్రకటించింది.

అన్నపూర్ణమ్మ 1942 లో చనిపోయింది. సీతాపతిగారు మాత్రం 1969 దాకా తమ తండ్రిగారి మార్గంలోనే భాషా సాహిత్య పరిశోధకుడుగా చరిత్ర సృష్టించారు. అనేక గ్రంథాలు రచించారు.

సీతాపతిగారి కుమారుడికి మళ్ళీ రామమూర్తి అనే పేరే పెట్టారు. ఆయన హైదరాబాదులో వుంటున్నారు. ఆయన కూడా తమ తండ్రి తాతల మార్గంలోనే 'సవరల' మీద ఒక పుస్తకాన్ని తెలుగులో ప్రకటించారు. తాతగారి జీవితాన్ని ఒక చిన్న పుస్తకంగా 1976 లో అచ్చువేశారు.

గిడుగు వారిది పండిత వంశం. రామమూర్తిగారు పండితుడే కాకుండా పరిశోధకుడూ అయ్యారు. భావి తరాలకు స్ఫూర్తి నిచ్చారు. ఆయన కథ కడలిలోని అలలాగా సాగిపోయింది. బహుముఖాలుగా విస్తరించింది.

# అధ్యాయం 2

# బహుముఖ పాండిత్యం

రామమూర్తిగారి పాండిత్యం ఏ ఒక్క సాహితీ విభాగానికో చెందింది కాదు. మానవీయ శాస్త్రాలనబడే వాటన్నిటితోను ఆయన తల స్పర్శి పాండిత్యాన్ని సాధించారు. ఆయనకు వచ్చిన చెవుడు కూడా ఆయన అవధానాన్ని పెంచింది. ధారణ మరింత మెరుగయింది. ఆయన తన జీవితంలో ప్రతి నిమిషాన్నీ విద్యా సంబంధమైన పనులతోనే గడిపాడు. ఒక్క క్షణం వ్యర్థంచేసి ఎరగడు. అలాగని ఒట్టి పుస్తకాల పురుగు కాడు. ఎంతో లౌక్యుడు. లోకం మర్యాదలు బాగా ఎరిగినవాడే. కాకపోతే తన పాండిత్యాన్ని జీవితానికి, చుట్టూ ఉన్న సమాజానికి అనుగుణమైన పద్ధతిలో విస్తరింపచేసుకుంటూ వెళ్ళాడు. 1906 దాకా తెలుగు సాహిత్యంలో ప్రవేశించని వాడు 1913 వచ్చేటప్పటికి మహోపాధ్యాయుల భాషలో కూడా వ్యాకరణ దోషాలున్నాయని నిరూపించగల్గేంత ఎదిగాడు. దీనికి కారణం నిరంతర దీక్ష. మహాభాష్యం నుంచీ మొదలుపెట్టి సెక్సువిజ్ఞానం దాకా పంతులుగారికి తెలీని శాఖ లేదు. కనపడిన ప్రతి అక్షరాన్నీ తన చైతన్య గుహలో బంధించేశా రాయన. ఎప్పుడు ఏది కావాలన్నా తళుక్కున స్ఫురించేది. ఏం మాట్లాడినా ఏం రాసినా సమగ్రత, నిర్దుష్టత, ఋజుత్వం తొణికిసలాడేవి.

*చరిత్ర పరిశోధన*

హైస్కూలు తరగతులకు చరిత్ర పాఠాలు చెబుతున్నా తరగతి కోసమే కాకుండా తన విజ్ఞాన విస్తరణ కోసం ఆయన సమకాలికంగా వచ్చిన చరిత్ర గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివేవారు. బ్రిటిష్, రోమన్, స్విస్, ఫ్రెంచి, అమెరికన్ చరిత్రల్ని వడ

పోశారు. ఆ అనుభవంతో చరిత్రను విలక్షణంగా బోధించేవారు. పంతులుగారికి చరిత్ర అంటే వ్యక్తుల కథలు కావు. ఒక సామాజిక సంస్కృతిలో వచ్చిన పరిణామాలు వ్యక్తుల మీద, సమాజం మీద ఎలాంటి పరిణామాల్ని కల్గించాయో చూడటమే. విజ్ఞాన బోధన కన్నా 'సీరియస్'గా చరిత్రను పాఠం చెప్పేవారట.

ఈ చారిత్రక స్పృహతోనే ఆయన 'ముఖలింగం పరిసరాల ప్రాచీనత' మీద అచ్చులో 35 పుటలు పట్టే వ్యాసాన్ని అధో జ్ఞాపికలతో ప్రామాణిక సూచనలతో వంశ వృక్షాలతో రాశారు. ఈ వ్యాసంలో ఆయన పది అంశాలు చర్చించాడు :

1. ముఖలింగేశ్వర ఆలయం, 2. భీమేశ్వర ఆలయం, 3. సోమేశ్వర ఆలయం, 4. ప్రాచీన ఆలయ శిథిలాలు, 5. పద్మ నాభుని కొండ, 6. ప్రాచీన నాణాలు, 7. పాడుపడిన పాత కోటలు, 8. కాళింగులు, 9. తెలిగివెంటలోని శిలాశాసనం, 10. తామ్ర శాసనాలు.

ఈ వ్యాస సారాంశాన్ని ఇలా చెప్పవచ్చు. ముఖలింగ శాసనాల్లో పేర్కొబడిన కళింగ నగరం 'ముఖలింగమే' -తప్ప కళింగ పట్నం కాదు. పర్లాకిమిడి రాజులు అనంతవర్మ చోడ గంగ దేవుని వంశంలోని వారే. ముఖలింగక్షేత్ర మాహాత్మ్యంలో శబరుల ప్రసక్తి ఉండటం వల్ల కళింగ దేశంలో అతిప్రాచీన కాలంలో శబరులు రాజ్యం చేసి వుండాలి.

రామమూర్తి వ్యాసం ప్రకటించగానే ప్రభుత్వం వారు ఈ 22 శాసనాల నకళ్ళు తీయించి తమ 1896 వ సాంవత్సరిక నివేదికల్లో ప్రచురించారు.

ఇంకా రామమూర్తిగారు 'నడిగాం' తామ్రశాసనాన్ని పరిష్కరించారు, శాసనంలోని శ్లోకాలనుబట్టి క్రీ. శ. 1038 షే

31 వ తేదీ రాత్రి 8-20 నిముషాలకు వజ్రహస్తుడు పట్టాభిషిక్తు డయ్యాడని నిర్ధారించారు. ఈ శాసనాన్ని ఆధారంగా ఆ రోజుల్లో ముఖలింగాన్ని కళింగ నగరమనే వారని కూడా నిరూపించారు. స్టెన్ కొనో (ఎపిగ్రాఫియా ఇండికా 9-95), విన్సెంట్ స్మిత్ (ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా - 498), షుల్జ్ (ఎపిగ్రాఫియా ఇండికా 14-332) లు తమ తమ రచనల్లో రామమూర్తి నిర్ణయాన్ని అంగీకరిస్తున్నట్టు రికార్డు చేశారు.

1895-96 లో మరి రెండు శాసనాల్ని పరిష్కరించారు. దీర్ఘాసి, కొంకుదురు శాసనాలు. కొంకుదురు శాసనాన్ని అల్లయ దొడ్డారెడ్డి వేశాడు. అందులో 'అర్ధోదయ పుణ్యకాల' మన్న ప్రయోగం వుంది. ఈ అర్ధోదయ పుణ్యకాలమంటే ఏమిటో తెలి యక పంతులుగారు కీత్ హారన్ దొరకు రాశారు. ఆయన సమా ధానం రాశారు. తమ వ్యాసంలో దొరగారి పేరు స్మరిస్తూ 'అమా వాస్య, ఆదివారం, వ్యతీపాతం, శ్రావణం కలిసి పుష్యమాఘ మాసాల్లో వచ్చే యోగాన్ని అర్ధోదయం అంటారు. దీన్ని బట్టి ఈ దానం జరిగింది 1432 జనవరి 14 న' అని రామమూర్తి నిశ్చ యించారు.

1911 తరువాత రామమూర్తిగారు పూర్తిగా భాషా వివాదాలతో తల మునకలుగా ఉండటం వల్ల శాసన చరిత్రల వైపు ఎక్కువ కాలం వినియోగించలేకపోయారు. తూర్పు గాంగుల ఆరు తామ్రశాసనాల్ని సంపాదించారు కాని, పరిష్కరించే బాధ్య తను శిష్యుడు చిలుకూరి నారాయణరావు మీద పెట్టారు. ఆ తర్వాత రాళ్ళబండి సుబ్బారావుగారు వాటిని పరిష్కరించి వ్యాస సంగ్రహం (1933) లో ప్రచురించారు. వీరే కాకుండా మండ నరసింహారావు, భావరాజు కృష్ణారావు మొదలైన శిష్యు లనేకులు శాసన లిపి పాఠ పరిష్కరణ విద్యను నేర్చుకొన్నారు.

వాడుక భాషా పోరాటం జరుగుతున్న రోజుల్లో కూడా గిడుగు గురజాడలు శాసన ప్రయోగాల్ని ఆధారంగా వాడుకున్నారు. శాసన రూపాల్ని ఎవరూ మార్చలేరు కాబట్టి అవి ఆనాటి ప్రామాణిక వ్యవహార రూపాలు. అంచేతనే ముద్రితమైన నన్నయ గారి తెలుగు భారతానికి, వ్రాత ప్రతులలో ఉన్న దానికీ నడుమ ఉన్న తేడాలను రామమూర్తిగారు పోల్చి చూశారు. 1919 లో తంజావూరు వెళ్ళినపుడు అక్కడున్న భారత ప్రతులతో తైపారు వేస్తే రామమూర్తిగారికి ఒక విషయం తెలిసింది.

ముద్రిత ప్రతులలో ఆశీరర్థక రూపం - *ఎడుంగా* కని పిస్తుంది (గాచుచుండెడున్). కాని వ్రాత ప్రతుల్లో - *ఎడిం* గా కని పిస్తుంది (గాచుచుండెడిన్). దీనికోసం రామమూర్తిగారు శాస నాల్ని వెదకడం మొదలుపెట్టారు. హైదరాబాదు ఆర్కియలాజి కల్ డిపార్టుమెంటు వారి శాసన సంపుటాల్లో ఉప్పర్పల్లి శాస నంలో (కాకతి గణపతిదేవుడి కాలం నాటిది) - *ఎడిం* తో కూడిన రూపం దొరికింది. అంటే ముద్రితరూపం తప్పన్నమాట. వెంటనే తమ అభిప్రాయాన్ని లండన్‌లో ఉన్న బార్నెట్ దొరకు, బిల్ గ్రామ్‌గారి ద్వారా తెలియజేశారు. బార్నెట్ దొర ప్రొఫెసర్ రామమూర్తి సూచనని అంగీకరిస్తూ ఎడమాంత రూపాన్ని తప్పొ ప్పుల పట్టికలో చేర్చాడు. ఈ విషయాన్ని 7-3-24 న రామ మూర్తిగారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి రాసిన ఉత్తరంలో ప్రస్తావించారు.

*సవరల విద్యాభివృద్ధి - కొన్ని సూచనలు :*

రామమూర్తిగారి పరిశోధన లన్నిటికి తనతోటి మానవుల్ని గురించిన ఒక తీవ్రమైన ఆందోళన ప్రధానమైన ప్రేరణ. అందుకే జీవితాంతం ఒకే శాస్త్రాన్నో, ఒకే సంప్రదాయాన్నో కావలించు

కొని ఉండిపోలేదు. చుట్టూ ఉన్న సామాజికావసరాలతో పాటు తన అధ్యయన పరిధిని పెంచుకొన్నాడు. అంచేత ఆయన్ని సమకాలికులు 'విధ్వంసకు' డని '[గ్రామ్యాచార్యు' డనీ చేసిన అవమానం వారి అజ్ఞతే తప్ప మరేమీ కాదని 1937 లో చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు గుర్తిస్తూ 'తేషాం నిందా నకర్తవ్యా: యుగ రూపాహి తే ద్విజాః' అనే పరాశర స్మృతిని ఉదాహరించారు.

ఆ రోజుల్లో మాళువా పర్వత ప్రాంతాల్లో ఉండిన సవరలు అడవి మనుష్యులు. కిరాతులుగా భావించబడేవారు. నరబలులు ఇచ్చేవారని, కల్లు తాగేవారని సభ్య సమాజం వారిని దూరంగా ఉంచేది. ఆనాటి సవరలే కాకుండా బంజారాలు, గోండులు, కొండదొరలు, యానాదులు కూడా అలాగే ఉండేవారు. వారి పరిస్థితుల్లో ఇటీవల రెండు దశాబ్దులుగానే కొద్ది ప్రగతి కనిపిస్తున్నది. కాని విద్యా విషయంలోనూ, సాంస్కృతిక వికాసంలోనూ వారు 19 వ శతాబ్దంలోనే ఉన్నారు. అందుకే రామమూర్తి సవరల విద్యా విషయమై 'ఎ మెమొరాండం ఆన్ ది స్టేటస్ ఆఫ్ ఎడ్యుకేషన్ అమాంగ్ ది సవరస్' అనే వ్యాసాన్ని 1894 సెప్టెంబరులో ప్రభుత్వానికి పంపారు. దానిలోని వివరాలు ఇక్కడ స్మరించటం చాలా అవసరం. ఇన్ని యూనివర్సిటీలలో పరిశోధనలు చేస్తున్నా గిరిజనుల విద్యాభివృద్ధి సాధించటంలో మనం విఫలు లయ్యాం. సవరల స్థితిగతుల మెరుగుదలకు ఆయన ఇచ్చిన సూచన లివి :

1. సవర భాషాధ్యయనానికి ఒక 'గైడు' ను ప్రచురించాలి.

2. గిరిజన పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయులు, ఆ ప్రాంతాల్లో పనిచేసే అధికారులు అవశ్యం సవర భాష నేర్చుకోవాల్సిందిగా ప్రోత్సహించాలి.

3. సవరల కోసం ప్రత్యేకంగా సాయంకాలపు తరగతులు తెరచి ప్రభుత్వ పాఠశాలలకు వీటిని అనుబంధం చెయ్యాలి.

4. సవర భాషలో మౌఖికంగా (oral) నే బోధన జరగాలి. బొమ్మలద్వారా పాటలద్వారా నేర్పాలి. నోటి లెక్కల ద్వారా గణితం నేర్పాలి. ఆ తర్వాత క్రమంగా చదవటం రాయటం నేర్పించవచ్చు.

5. పరీక్షలలో ఉత్తీర్ణులయ్యే విద్యార్థులకు ఇచ్చే బహుమతి గ్రాంట్లలో కొంత వెండి ఆభరణాల రూపంలో ఉండాలి. సవరలు అలాంటి ఆభరణాల్ని గర్వకారణంగా భావిస్తారు.

6. ప్రభుత్వ కార్యాలయాలకు సవర యువకులు వెళ్ళినప్పుడు వారు నేరస్థులు కాకపోతే కూర్చోవడానికి అనుమతించాలి.

7. గ్రామాధినేతలైన గొమాంగ్, బుయాలు సవర సమాజంలో పలుకుబడి ఉన్నవారు. అంచేత వారినే పాఠశాల నిర్వాహకులుగా నియమించాలి.

8 సవరలు, కొండ వారిలో కొందరిని ఎంపికచేసి వారికి ఉపాధ్యాయ శిక్షణ గరపాలి.

9. ప్రభుత్వ కార్యాలయాలకు అనుబంధించబడిన సవర దుబాసీలు (translators) విద్యావంతులై ఉండాలి. కనీసం వారు తమ మాతృభాషను చదవటం రాయటం తెలిసి వుండాలి.

10. సవర దుబాసీ విద్యావంతుడయితే అతణ్ణి సవర ఖైదీలకు బోధన గరపేందుకు వినియోగించవచ్చు. సవరలు తమ స్వభాషలో అర్జీలు పంపుకోవడానికి అనుమతించాలి. దుబాసీ వాటిని అనువాదం చేస్తాడు.

11. సవరల్లో విద్యావ్యాప్తి విషయంలో ప్రభుత్వంతో సహకరించేందుకుగాను బిసోయీ (మధ్యవర్తుల్ని) ప్రోత్సహించాలి. కారయితే సవరలకు షూటింగ్ పోటీలు, గుర్రపు పందాలు నిర్వ

హించి వారిని సాయంకాలపు తరగతులకు వచ్చేలా ప్రోత్సహించ గలరు.

12. అన్ని ఏజెన్సీ ప్రాంతాలలోను విద్యాభివృద్ధిని తనిఖీ చేసేందుకు గాను ఒక ప్రత్యేక అధికారిని నియమించాలి.

ఈ సూచనల్ని మనం ఈనాటికీ ఆచరణలో పెట్టలేక పోయాము. సవరలకే కాదు, బంజారాలకే కాదు, ఏ గిరిజన భాషకూ మనం స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించ లేకపోయాం. ఆ యా గిరిజన భాషలు సమీపంలో ఉన్న జాతీయ భాషలచేత ప్రభావితమై తమ తమ ఉనికిని కోల్పోతున్నాయి. ఈ దృష్టితో పంతులు గారి సూచనలు మొత్తం దేశంలోని భాషా పరిశోధకులంతా ఆలోచించాల్సిన అవసరం వుంది.

*రామమూర్తిగారి సామాజికావగాహన*

"ప్రజలలో విద్య వ్యాపింపచేయటమూ ప్రజల ఆరోగ్యము కాపాడటమూ ప్రజల సౌఖ్యము పోషించటమూ సంఘంలోని పెద్దలు చేయవలసిన ధర్మ కార్యమని ఆలోచించకూడదు. భాగ్య వంతులైన వారు తమ ఆరోగ్యం కాపాడుకోవాలంటే ప్రజల ఆరోగ్యం కాపాడాలి" అని పంతులుగారి దృష్టి.

పై వాక్యాలిబట్టి పంతులుగారు పుట్టిన సమాజ స్వభా వాన్ని కొంతవరకు అంచనా వేయవచ్చు. ఆయన యవ్వనం అంతా 19 వ శతాబ్దిలో గడిచిపోయింది. అప్పటికి ఫ్యూడల్ సమాజం అంతరిస్తూ బూర్జువా సమాజం అప్పుడప్పుడే తలెత్తుతూ ఉంది. బూర్జువా సమాజపు స్వేచ్ఛా దృష్టి, ప్రజాస్వామ్యభావాలు ఆ కాలంలో చాలామంది మేధావుల్ని ఆకర్షించిన మాట నిజమే కాని పంతులు గారిలోని మానవతా దృష్టి (humanitarian out look) బూర్జువా సమాజ పరిధిని కూడా కొంతవరకు దాటిపోయిందని

పై వాక్యాలు తెలుపుతాయి. ఆయన చేసిన 'సవర' పరిశోధనే దీనికి నిదర్శనం.

*సవర శబ్ద విచారం :*

ప్లినీ (క్రీ. శ. 77) '*సుఅరి*' అనీ, టాలెమీ (క్రీ శ. 130) '*సబరై*' అనీ పిలిచిన 'సవర' జాతి ఐతరేయ బ్రాహ్మణంలో, మహాభారతంలో, రామాయణంలో, కథాసరిత్సాగరంలో, తెలుగు సాహిత్యంలో పేర్కొబడ్డ 'శబరు'లే. యూరోపియన్ పరిశోధకులు కొలేరియన్, ముండా, సంతాలి, నిషాద అన్న పేర్లతో పిలిచారు కాని, 'శబర' అన్న మూలజాతికి సంబంధించిన ఉపజాతులుగా వీటిని నిరూపించవచ్చు. ఆర్యద్రావిడులు భారతదేశంలోనికి రాక మునుపే ఈ దేశంలో ఉన్న ఆదివాసులు 'సవరలు'.

*సవర సంస్కృతి :*

సవరలు గంజాం విశాఖపట్టణం జిల్లాలలో మాత్రమే కాకుండా ఒరిస్సా, బెంగాల్, సింగ్‌భూమి, సంబల్‌పూర్, రాయపూర్, బిలాస్‌పూర్, పాట్నా, కలహంది, సారంగర్, రాయగర్ మొదలైన మధ్య పరగణాలలో వ్యాపించి ఉన్నారు. రామమూర్తిగారూ, సీతాపతిగారూ సవరల నివాస స్థలాలు, ఇండ్ల నిర్మాణం, తిండి-బట్ట, పండుగపబ్బాలు, ఆభరణాలు, మతం, దేవతలు, దెయ్యాలు, కర్మకాండ, తెగ భేదాలు, గ్రామ పరిపాలన, వితంతు వివాహం, విడాకులు, శ్రాద్ధకర్మలు, సంగీత సాహిత్యాలు, వారి సామాజిక మనస్తత్త్వం మొదలైన అన్ని విషయాల మీద సమగ్ర పరిశీలన చేశారు.

సవరల వివాహాలు ఎలా నిర్ణయించబడుతాయో రామమూర్తిగారు వివరించిన పద్ధతి చాలా అద్భుతంగా వుంది. కల్లు కుండల ప్రాధాన్యం, పెళ్ళికూతురి అంగీకారం, ఇవన్నీ ఆ సంస్కృతీ

విలక్షణతను గుర్తించే అంశాలు. అలాగే క్రూర జంతువులు గూడెం లోకి ప్రవేశిస్తే బలు లివ్వటం, ఇళ్ళు అచ్చి వస్తాయా రాదా అన్న విషయాన్ని బియ్యపు గింజలద్వారా పరీక్షించటం, వారి పోడు వ్యవసాయ పద్ధతి, బిసోయీాల క్రింద సవరలు పడుతున్న ఆర్థిక పరమైన ఇబ్బందులు, సవరల్లో సామాజికమైన అంతరువులు లేకపోవటం, ఇంటి నిర్వహణలో తల్లి తండ్రి కొడుకు ముగ్గురూ వహించే బాధ్యతలు—వీటన్నిటినీ 'ఫోటో' తీసి చూపించినంత స్పష్టంగా రామమూర్తిగారు తమ 'మాన్యువల్'లో రికార్డుచేశారు. సవరల మీాద ఆ గ్రంథం ఒక విజ్ఞాన సర్వస్వం.

1927 లో గ్రియర్సన్ 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' (చూ. సం. 1-35) ప్రచురించినపుడు పంతులుగారే సవర భాషా విశేషాలు, 'ప్రాడిగల్ సన్ కథానువాదం' అందించారు. రామమూర్తిగారి కృషి తెలుగులో ఉండి పోవటం వల్ల యూరోపియన్ పరిశోధకులకు ఉపకరించడం లేదని గ్రియర్సన్ రాశాడు. అందుకే 1931, 1933, 1938 లో ప్రచురించిన సవర గ్రంథాలు ఆంగ్లం లోనే ఉన్నాయి. స్పష్టంగా తెలీటం లేదు కాని 1927 లో కలకత్తాలో ముద్రించబడిన 'టీ డిస్ట్రిక్ట్ లేబర్ అసోసియేషన్ వారి సవర భాషా పుస్తకం'లో కూడా రామమూర్తిగారి చేయి పడిందని పండితులు అనుమానిస్తున్నారు.

నిఘంటు నిర్మాణంలో రామమూర్తిగారి కున్న మెలకువ ఆరోపాల విషయంగా ఉన్న శాస్త్రీయతాదృష్టి మార్గదర్శకమైనవి. మాన్యువల్ గ్రంథంలో ఆయన రెవరెండ్ హాఫ్‌మన్ (ఎన్‌సైక్లోపెడియా ముండారికా)గారిని ఆధారంగా రూపాంతరాలను వేరుచేసినట్లు చెప్పుకొన్నారు. పదాల వర్గీకరణలో, వ్యాకరణాంశాల నిరూపణలో, అవ్యాకృత అసమ్మతరూపాల నిర్ణయంలో, వాక్యభేదాల్ని, జాతీయాల్ని, సామెతలు, పాటలు, కథలు, సంభాషణలు-

అన్నిటినీ ఒకచోట చేర్చిన మహాగ్రంథ మది. ఈ నాటికీ యూని వర్సిటీ పండితుల్లో చాలామందికి ఈ గ్రంథం ఉందని కూడా తెలియదు.

సీతాపతిగారు కూడా సవరల్ని గురించి మానవ పరిణామ శాస్త్రదృష్టితో కొంత పరిశోధన చేశారు. నాగపూర్‌లో 1945 లో జరిగిన సైన్స్ కాంగ్రెస్సులో సీతాపతిగారు 'ద్రావిడ-ద్రావిడ పూర్వ సంస్కృతుల' మీద వ్యాసం చదివారు. ఆ వ్యాసంలో ఆయన పర్లాకిమిడి, గోదావరి అనే మాటలు సవర మూలరూపాలనుంచి ఏర్పడ్డాయని చెప్పారు.

సవర భాషా పరిశోధకులకు రామమూర్తి పేరు ఎప్పుడూ స్మరించదగిందే. థర్‌స్టన్ తన 'దక్షిణభారత జాతులు-తెగలు' అనే పుస్తకంలో గిడుగు వారి అభిప్రాయాల్ని ఎన్నో చోట్ల వాడు కున్నారు. స్టాన్లీ స్టరోస్టా అనే హవాయీ యూనివర్శిటీ ప్రొఫెసరు, తాను సవర భాషమీద రాసిన పరివర్తన వ్యాకరణాన్ని పంతులు గారికి అంకితం కూడా ఇచ్చాడు.

***తొలి తెలుగు భాషా విజ్ఞాని :***

వ్యాకరణశాస్త్రకారుడు భాషా ప్రయోగంలో సాధు - అసాధు రూపాల్ని నిర్ధరిస్తాడు. భాషా విజ్ఞాని అలా కాకుండా సాధు-అసాధు రూపాల వెనుకనున్న భాషా నిర్మాణ వైవిధ్యాన్ని, చారిత్రక పరిణామాన్ని వివరించే ప్రయత్నం చేస్తాడు. ఈ అర్థంలో గిడుగు రామమూర్తిగారు తొలి తెలుగు భాషా విజ్ఞాని.

ఉద్యోగం నుంచి 1911 లో రిటైరు అయ్యాక రామమూర్తి తెలుగు భాషమీదే ఎక్కువ శ్రమించారు. 1912 లో జోన్సు ధ్వని శాస్త్రం (Phonetics) మీద ఇచ్చిన ఉపన్యాసాలకు సీతా పతితో కలిసి మదరాసుకు వెళ్ళినపుడు జోన్స్‌తో తెలుగు ధ్వను లలో కనిపించే ఒక విలక్షణత గురించి ప్రస్తావించాడు.

పిట్టు - పిట్ట; పీకు - పీక; మెట్టు - మెట్ట; మేకు - మేక

పుట్టు - పుట్ట; గూడు - గూడ; పొట్టు - పొట్ట; గోడు - గోడ

పైని చూపిన పదాల జంటల్లో రెండో మాటల్లోని మొదటి అక్షరం (పిట్ట-లోని పి)లోని అచ్చు ఉచ్చారణ, మొదటి మాటల్లోని మొదటి అక్షరంలోని అచ్చుకన్నా (పిట్టు-లోని పి) భిన్నంగా వుంటుంది. ఈ జంటల్లో మొదటి మాటల్లోని మొదటి అచ్చు సంవృతం (Closed), రెండో మాటల్లోని మొదటి అచ్చు వివృతం (open) - ఈ భేదాన్ని గురించి రామమూర్తి జోన్స్‌తో చర్చించాడు.

ఇలా జోన్స్‌తో మొదలయిన పరిచయం ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా బలపడింది. 1914 లో యూరోపియనులు తెలుగు నేర్చుకోవడానికి అనువయిన తెలుగు రీడరును ధ్వని లిపిని ఉపయోగిస్తూ తయారుచేసి పంపాలని జోన్సు పంతులుగారికి ఉత్తరం రాశాడు. ధ్వని లిపి సంకేతాలున్న టైపురైటర్‌ని పంపితే అలాగే చేస్తానని పంతులుగారు బదులు రాశారు. జోన్స్ అలాగే పంపాడు. తండ్రీ కొడుకులు తెలుగు రీడరును తయారుచేసి లండన్‌కి పంపారు. జర్మనీలోని భాషా శాస్త్రవేత్తలతో చర్చించడానికి జోన్సు ఆ గ్రంథాన్ని జర్మనీకి తీసుకు వెళ్ళాడు. ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది ఇప్పటికీ ఆ గ్రంథం అచ్చు కాకుండా అలాగే ఉండిపోయింది. సీతాపతిగారు 1933 లో లండన్ వెళ్ళినపుడు జోన్స్ దగ్గర శిథిలమై ఉన్న ఆ గ్రంథాన్ని తుది మొదళ్ళు పూర్తిచేసి ఇచ్చారట. కాని ఆ గ్రంథం ఇంతవరకు వెలుగు చూడలేదు.

ఆటో ఎస్పర్సన్ వ్రాసిన "ఎ షార్టర్ ఇంగ్లీష్ గ్రామర్"ని కూడా రామమూర్తి అనువదించారు. అది కూడా అలభ్యమే.

## తెలుగులో విద్యా బోధన

1901 లో అప్పటి గవర్నర్ జనరల్ కర్జన్ విద్యా సంబంధమైన సదస్సును ఒక దానిని జరిపి ప్రాథమిక స్థాయినుంచి యూనివర్సిటీ దాకా విద్యా స్థాయి ఎలా ఉండాలో సమీక్షింపజేశాడు. 1903 లో ఒక నిపుణుల సంఘాన్ని నియమించి భారతీయ భాషలు ఎంతవరకు ప్రగతిని సాధించాయో పరిశీలించమని కోరాడు. ఆ సంఘం వారు రెండేళ్ళపాటు పరిస్థితిని సమీక్షించి యూరోప్‌లో వృద్ధిపొందుతున్న ఆధునిక శాస్త్ర పరిజ్ఞానాన్ని భారతీయ భాషల ద్వారా సామాన్య ప్రజానీకానికి కూడా అందుబాటులోకి తీసుకురావాలని సిఫార్సు చేశారు. ఈ ప్రాంతీయ భాషాభివృద్ధికోసం మద్రాసు ప్రెసిడెన్సీలోని ఉత్తర జిల్లాలు గంజాం, వైజాగ్, గోదావరి జిల్లాలకు కలిపి జె. ఎ. ఏట్సు అన్న ఒక స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ని నియమించారు ఆయన కేంద్రం విశాఖపట్నం.

మార్క్ హంటర్ ఆ రోజుల్లో రాజమండ్రి కళాశాల ప్రిన్సిపాలుగా ఉండేవారు. ఆయన ఏట్సు చేత ఒక పక్షం రోజులపాటు బోధన పద్ధతుల మీద, ప్రాంతీయ భాషల అభివృద్ధి మీద ఉపన్యాసాలు ఏర్పాటు చేశాడు. 'భాషలు తొలుత పుడతాయి. తర్వాత వాటికి వ్యాకరణాలు రాస్తారు. భాషలు మారినట్లే వ్యాకరణాలు కూడా మారాలి,' అని ఏట్సు తెలుగు పండితులకి సందేశం ఇచ్చాడు. సమాజంలో ఒక భాషను మాట్లాడుతూండగా పండితులు ఉపాధ్యాయులు తమ రచనల్లో మరో భాషను (గ్రాంధికాన్ని) ఎందుకు వాడుతారో అర్థంకాని విషయంగా ఉందని ఆ యూరోపియన్ పండితుడు ఆశ్చర్యపడ్డాడు. నిజమే! ఇంగ్లీషులో మాట్లాడే భాష, రాసే భాష ఒకటిగానే ఉంటుంది కదా!

దేశీయ పండితులు ఇలా ఎందుకు రాస్తున్నారో తెలుసుకోగోరి, విశాఖపట్నంలో ఎ. వి. ఎన్. కాలేజి ప్రిన్సిపాలుగా ఉన్న

పి. టి. శ్రీనివాసయ్యంగారిని కలుసుకొని 'ఇది ఏమిట'ని అడిగాడు. ఆయన అప్పారావుగారిని, రామమూర్తిని కలుసుకొమ్మని సలహా ఇచ్చాడు.

అప్పారావుని ఏట్స్ కలిశాడు. 'తాము 1897 లోనే తమ కన్యాశుల్కం నాటకంలో వ్యావహారిక భాషనే వాడినట్టు చెబుతూ, పాఠ్యగ్రంథాలలో కాని, పుస్తకరచనల్లో కాని, అనువాద గ్రంథాల్లో కాని విద్యాబోధనకోసం కాని వ్యావహారికాన్ని వాడటానికి పండితులు ఏమాత్రం సుముఖంగా లేర'ని వాపోయారు.

ఏట్స్ రామమూర్తిని కలిశారు. వీరిద్దరు కలుసుకొని మాట్లాడినపుడు సీతాపతిగారూ ఉన్నారు. "ఏ భాషలోనైనా మాట్లాడే భాష, రాసే భాషల మధ్య కొద్దిగానైనా తేడా కనిపిస్తుంది. కాని తెలుగులో ఈ రెంటి మధ్యా కనిపించేంత దూరం మరి ఏ భాషలోనూ కనిపించడం లేదు. మీ ఇంగ్లీషు పండితులు బుద్ధిమంతులు కాబట్టి సమాజంలోని భాష మారినకొల్లా సాహిత్య భాషను కూడా మార్చుకుంటూ వచ్చారు. ప్రతి భాషలోను కావ్య శైలిలో వాడుకలో లేని కొన్ని ప్రాచీన పదాలు, కనిపిస్తూ ఉంటాయి. కాని వచన రచనలో మాత్రం ఏమాత్రం కనిపించవు. వీలయినంతవరకు వచన రచనలో ప్రాచీన పదాలు దొర్లకుండా మీ రచయితలు జాగ్రత్త పడతారు. తెలుగు రచయితల పద్ధతి ఇది కాదు. ప్రాచీన గ్రాంథిక రూపాలను వాడటం రచయిత ఒక గౌరవంగా భావిస్తాడు. వచన రచనలో కూడా ప్రాచీన రూపాలు, సంస్కృత పదాలు, శబ్దాలంకారాల డాంబికం ఉండేలా ప్రయత్నిస్తాడు. ఈ కృతకమైన క్లిష్ట శైలిని 60 ఏళ్ళ క్రితం చిన్నయసూరి తన గ్రంథాలలో మొదలుపెట్టాడు. పాఠశాల స్థాయిలో ఆ గ్రంథాలనే పిల్లలకి బోధిస్తున్నారు. ఆ శైలిలోనే పరీక్షలలో ప్రశ్నలకు సమాధానాలు రాయాలని వారిని నిర్దేశించి

ఉన్నారు. ఉపాధ్యాయుడు ఆ పాఠాన్ని వ్యావహారిక భాషలోనే బోధించినా విద్యార్థి మాత్రం మళ్ళీ ఆ గ్రాంథిక భాషలోనే సమాధానం రాస్తున్నాడు. ఈ విషయాలన్నీ ఇప్పటికే నాకు బాగా తెలుసు. కాని ఏం చెయ్యను! నేను పరీక్షల కోసం సంస్కృతం చదువుకున్నాను. అంచేత తెలుగులో నాకు ఏ పాండిత్యమూ లేదు. నేనేదైనా మాట్లాడదలిస్తే నీకు కావ్య భాషా తెలియదు. తెలుగు పాండిత్యమూ లేదు. నువ్వు మాట్లాడకు అని అంటూ' రని స్పష్టంగా తన అభిప్రాయాలు చెప్పాడు.

'ఈ విషయాన్ని గురించి నా అభిప్రాయం చెప్పటానికి ఇంకా సమయం కావాలి' అని కూడా అన్నారట.

దీన్నిబట్టి రామమూర్తిగారికి 1906 దాకా తెలుగులో ఏ ప్రవేశమూ లేదని అనుకోకూడదు. కాకపోతే సవర భాషాను శాసకుడుగా చరిత్ర శోధకుడుగా ఆయనకి తెలుగు పండితులతో నేరుగా సంబంధం ఉండేది కాదు. అందుకే ఇలా అన్నారు.

గిడుగు వారు 1906-1907 మధ్య ఆలోచించి ఏట్స్ ఏర్పాటు చేసిన ఉపాధ్యాయ సదస్సులలో (1907 మే, 1908 మే, 1910 మే) తెలుగు పండితులకు భాషలు మారతాయని, మారటం భాషకు సహజ ధర్మమని ప్రబోధించడంతో 'వ్యావహారిక భాషా' వాదానికి పీఠిక తయారు చేసుకొన్నారు. దీని వివరాలు మరో అధ్యాయంలో చర్చిస్తాను.

ఇక్కడ మనం గుర్తించాల్సిన అంశం వ్యావహారికంలో విద్యాబోధన ఎందుకు సాగాలని పంతులుగారు వాదించారన్న విషయం.

"మాదిగ వెంకడు మొదలుకొని వెంకటావధానులవరకున్న వెయ్యింటికి 75 గురు మాత్రమే ఓనమాలు వచ్చిన వారున్నపుడు గ్రాంథిక భాష వచ్చిన వారు 5 గురు ఉందురో ఉండరో! అయితే నాగరికుల తెలుగు - తేట తెలుగు లోక వ్యవహారములో ఇపుడు

వాడుతున్న వారే వెయ్యింటికి అధమ పక్షము నూరుగురైనా ఉంటారు. (అది తెలుసుకోగలిగినవారు వెయ్యింట ముగ్గురుగురైనా ఉంటారు.) క్రమ క్రమముగా వాడుక ఎక్కువయి అంతకంతకు దిగువ జాతులకు అది వ్యాపిస్తుంది. ఈ తేట తెలుగులో తెలివి కలిగించే విద్య అందరికీ చెప్పితే సరస్వతి తెలుగు దేశములో తాండవమాడదా!''

పంతులుగారు 'ప్రమాణ భాష' (Standard languge) ఎలా ఏర్పడుతుందన్న విషయంగా చెప్పిన అంశాలు చాలా ముఖ్యమైనవి. విద్యాబోధనలో వాడుక భాషే ఎందుకు అవసరమో ఆయన ఇలా చెప్పారు :

''నోటి మాటకు చేతి వ్రాతకు సామ్యమున్నందువల్ల లాభము ఒక దేశము వారు మరొక దేశ భాషను నేర్చుకొనుట చాలా సులభముగా ఉంటుంది. మాటకు, ఇంగ్లీషు వారిలో అనేకులు ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్, పోర్చుగీసు, స్పానిష్ మొదలయిన యూరోపియను భాషలన్నీ గాని కొన్ని గాని అవకాశము కొలది నేర్చుకున్న వారున్నారు...ఇతరులతో సహవాసము చేయడము చేతను, ఆ భాషే గ్రంథములలోను వార్తా పత్రికలలోను కంటితో చూచి చదవడము చేతను—ఇట్లు చెవికి, నాలుకకు, కంటికి, చేతికి కూడా అలవాటయి వ్యత్యాసము లేకుండా ఏక రూపమయిన భాష మనస్సులో నాటుకొంటున్నది. లోక వ్యవహారమందు ప్రవృత్తి లేక గ్రంథములందే ఉన్న భాషను దాని లక్షణమంతా వల్లించినా వాడుక చేయడము సులభము కాదని అందరికీ తెలిసిన విషయమే ...వాడుకలో ఉన్న భాషే వ్రాతలో కూడా పెట్టితే అక్షరములు మాత్రము నేర్చుకొంటే చాలును. ఎవరైనా ఆ భాష చదువవచ్చును; వ్రాయ వచ్చును.''

''స్వరాజ్యం కావలెనంటున్నాము. ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం చిక్కుపడుతున్నాం. ప్రజాస్వామిక పాలనం కోరుతున్నాం.

ఇటువంటి పరిస్థితులలో మన ప్రజలకు, సామాన్య జనులకు ఏ భాష ద్వారా జ్ఞానం కలుగచేయవలసి ఉంటుందో, ఏ భాషలో గ్రంథ రచన సాగించవలసి ఉంటుందో ఆలోచించండి!''

అన్నదే వారి తుది విన్నపం కూడా.

ఇంత మాత్రమే కాదు.

"ప్రజల వాడుక భాష యొక్క ప్రయోజనములు అంగీకరించని పండితుల చేతిలో ఉన్న అంకుశము తీసివేస్తేనే గాని ప్రజల హక్కులను నిరోధిస్తూ ఉన్న ప్రభుత్వము వారి చేతిలోని అంకుశమును లాగివేసిన ప్రయోజన ముండదు. నేడు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడవచ్చును. రేపు స్వరాజ్యము రావచ్చును; ప్రభుత్వము ప్రజాస్వామికము కానూ వచ్చును. అయితే, ఈ రోజులలో మన స్వాములు నిరక్షర కుక్షులయి ఉంటే, దేశమునకు ఎంత ఉపద్రవము కలుగునో మన దేశనాయకులు, దేశభక్తులు, దేశబంధులు లెస్సగా ఆలోచించవలసి ఉన్నది. మన తెలుగు వారిలో నూటికి తొంభై మందికి ఇంకా ఓనమాలైనా రావు సుమండీ.''

అని సరిగా ఈనాటి పరిస్థితిని జోస్యం కూడా చెప్పగలిగారు. ఒక కాంగ్రెస్ కార్యకర్తతో 'మీరు ప్రచురించే కరపత్రాలను పామర జనులు చదువుకోవాలంటే వాడుక భాషలోనే చదువు నేర్వాలి' అని కూడా చెప్పారు. అంచేత వ్యావహారికాన్ని ఆయన ఒక సామాజిక దృష్టితోనే ప్రచారం చేశారన్నది మనం గుర్తుంచుకోవాలి.

ఆ దృష్టి అర్థంకాని వారే ఆయన చుట్టూ ఉన్న పండితులంతా. అంచేత వారికి అర్థం అయ్యే భాషలో తన వాదాన్ని నవరించదలిచారు. అందుకే 1908-1930 ల మధ్య ఆయన చేసిన పని శిష్టులు చదివిన చదువునంతా పరీక్షకోసం చదివినట్టు చద

వటం. వార్తా పత్రికల మొదలు వేదోపనిషత్తుల వరకు ఉన్న వాఙ్మయ సర్వస్వాన్నీ పుక్కిట బట్టారు. చదివిన ప్రతి పుస్తకం లోనూ ఎర్ర పెన్సిలుతో అపప్రయోగాల్ని గుర్తుపెడుతూ పోయారు. దేశంలో ఏ ఒక్కడికీ గ్రాంథికం పూర్తిగా రాదని నిరూపించారు.

## *గిడుగువారి శిష్ట పాండిత్యం*

ఆధునిక యుగంలో శిష్టులలో శిష్టులు విశ్వనాథ సత్యనారాయణగారు. వారి గురువు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు. అంతటి ఘన విద్వాంసుడు గిడుగు వారి పాండిత్యాన్ని గురించి ఇలా కితాబు ఇచ్చారు :

"...నన్నయభట్టు మొదలుకొని నేటి వరకున్న బయలు దేరిన భాషాను శాసకులలో ఎవరికి గాని గిడుగు పంతులకు తెలిసినన్ని మహాకవి ప్రయోగాలు తెలియవని ఏ ప్రమాణం పడితే ఆ ప్రమాణం చెయ్యడానికి జంకను...అది ఎక్కడి పరిశీలనా జ్ఞానమో! ఒక్కొక్క శబ్దాన్ని ఎత్తుకొని వర్ణక్రమాలు వ్రాయటం మొదలిడితే, వంశ వృక్షాలు వ్రాయటం మొదలిడితే అదే వ్రాయడం, అదే వ్రాయడం; ఆ వ్రాయడంలో ఒక్క అక్షరం కూడా సూటి దప్పినదంటూ వుండదు. అదెక్కడి పాండిత్యమో! నిజంగా గ్రాంథిక కవుల మని పేరు పెట్టుకొన్న వాళ్ళందరూ ఆత్మ వంచన లేని వాళ్ళే అయితే వక మహాసభ చేసి వారి వారి బిరుదాలన్నీ పంతులవారికి సమర్పించి ఆయన అనుగ్రహించి మళ్ళీ ఇచ్చేటట్టయితే అలంకారార్థం ధరించుకోవలసిందే కాని లేకపోతే వదులు కోవలసిందే."

## *శిల్పం - కామశాస్త్రం*

రామమూర్తిగారు సరసుడు. కాని చూసిన వారికి ఆయనలో భాషా శాస్త్రాభిమానం తప్పా మరొకటి కనిపించేది కాదు.

శ్రీనివాస శిరోమణిగారు ఒకసారి రాజమండ్రి వెళ్ళారట. పంతులు గారు పాళీ భాషలో 'మహా వంశాన్ని' చదువుతున్నారట. మరో సారి శిరోమణిగారు, పంతులుగారు, తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి గారు కలిసి ప్రయాణం చేస్తున్నారు. పంతులుగారు ఎంతసేపటికి వ్యాకరణాన్ని గురించే మాట్లాడుతూ ఉంటే వీరికి విసుగుపుట్టింది. ఎలాంటి వారైనా శృంగార చర్చలో బడితే ఒళ్ళు మరచిపోతారని తెలిసిన శాస్త్రిగారు తెలుగు ప్రబంధాలలోని శృంగారం మీద చర్చ మొదలుపెట్టారు.

అంతే పంతులుగారు చప్పున అందుకొని "నేను ఇంగ్లీషులో సెక్సు పుస్తకాలు చదివాను. హేవలిక్ ఎల్లిస్ వ్రాసిన పుస్తకా లన్నీ చదివాను. అంతటితో ఊరుకోలేదు. అయినాక్ బ్లాక్ పుస్త కాలు చదివాను ఇంకా క్రాప్టి ఎవిలింగ్ వ్రాసిన సైకో పాతియా సెక్సియాలిస్ చదివాను. వాళ్ళు చెప్పే విషయాలు ఎంతవరకూ వాస్తవములో అని మనుష్యులను పరిశీలిస్తూ వచ్చాను. వాళ్ళు చెప్పిన విషయాలు చాలావరకు అనుభవములోనికి వచ్చినవి" అంటూ సెక్సు పాఠాలు మొదలుపెట్టారు.

ఒక మిత్రుడు—ఆయన చిత్రకారుడు - 'చిత్ర రచనలో దిగంబరత్వం ఎందుకు వచ్చిం'దని ప్రశ్నించాడు. గోపీనాథరావు వ్రాసిన 'ఇకనోగ్రఫీ' పుస్తకాల్ని తాము చదివినట్టు చెబుతూ పంతులుగారు శిల్పం మీద ఉపన్యాసం మొదలు పెట్టారు.

బి. డి. బసు అనే చరిత్రకారుడి 'క్రైస్తవ సామ్రాజ్య'మనే గ్రంథం విషయం ప్రస్తావిస్తే "బసు హిందూదేశ చరిత్ర వ్రాయ డము మానివేసి వెల్లస్లీ స్వంత వ్యవహారాలు పట్టుకొని వచ్చి రాజ కీయాలకు ముడివేయడము చరిత్రకారుడు చేయవలసిన పని కాదు" అని తమ అభిప్రాయాన్ని తెగవేసి చెప్పారు. సిపాయి యుద్ధాన్ని గురించి బసు రాయకపోవడాన్ని గురించి చెబుతూ 'జాన్ విలియం

కేవే మూడు సంపుటాలు రాశాడని, కేయే అభిప్రాయాలు తప్పని మాలిసన్ రెండు సంపుటాలు రాశా'డని పంతులు గారన్నారట.

అలా ఆయన ఒక జంగమ సరస్వతీ భాండాగారం లాగా ఉండేవాడు. ఎవరో మిత్రుడు రాశాడు. 'తెలుగును ఇటాలియన్ ఆఫ్ ది యీస్ట్' అని ఎందుకంటారో తెలపాలని. దానికి పంతులు గారు ఇలా రాశారు :

''చాలా కాలము క్రిందట ఏదో పత్రికలో చూచి ఉన్నాను. కొందరు యూరోపియను బాటసారులు తెలుగు దేశమందు సంచరిస్తూ స్త్రీలు చెరువుగట్టు మీదను, పొలాలలోను మాట్లాడడము విని వారి భాష శ్రావ్యముగా ఉన్నదనిన్ని, (ఇటాలియన్ వలె) పాటలు కూడా మనోహరముగా ఉంటవనిన్ని మెచ్చుకొన్నారట. ఈ మెప్పు గ్రాంథికాంధ్రమునకు చెందదు. పాశ్చాత్యులు గదా ఈలాగున మెచ్చుకొన్నది. వారి చెవిని బడ్డ భాషను మెచ్చుకొన్నారు గాని పుస్తకాలలో వ్రాసిన దానిని గాదు...'' [చిరునామా లేని గిడుగువారి లేఖ 20-3-39]

వారి తర్కశక్తి అమోఘమైంది. వారి శైలిలో నిండుదనం వుంది. అందుకే వారి పాండిత్యం 'తెలివిడి' కల్గించేదే తప్ప, అర్థం కాని గోలపెట్టేది కాదు.

ఇన్ని శాస్త్రాలతో పరిచయం ఉన్నా పంతులుగారికి భాషా విజ్ఞానం మాత్రమే ప్రాణ స్థానంగా మిగిలిపోయింది. అందుకే 1912 లో గురజాడ అప్పారావుగారు ఆంధ్ర విశ్వ విద్యాలయానికి ఒక లేఖ రాస్తూ రామమూర్తిగారిని 'రీడర్'గా నియమించాలని సిఫార్సు చేశారు.

"మనకు తెలిసినంతవరకు భారతీయుల్లో కాని యూరోపియనుల్లో కాని తెలుగు భాషను వైజ్ఞానిక నేపథ్యంతో పరిశోధించాడని చెప్పగల ఒక్క పండితుడూ లేడు. అలా చెప్పగలిగినవాడు గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారొక్కడే. శాస్త్రీయ పద్ధతుల్లో భాషా విశ్లేషణ చెయ్యడానికి బహుకాలంగా శ్రమించిన పండితుడు ఆయన తప్ప మరొకడు లేడు."

గిడుగు వారు విశ్వవిద్యాలయంలో ఆచార్యుడై ఉంటే ఎంత బాగుండేది!

## అధ్యాయం 3

# కళాప్రపూర్ణుడి వాగ్వ్యర్థాలు

పంతులుగారి జీవితంలో ఎక్కువ భాగాన్ని ఆక్రమించింది నవర భాషా పరిశోధన కాగా, ఎక్కువ కీర్తి సంపాయించి పెట్టింది వ్యావహారిక భాషా ప్రచారం. వార్తా పత్రికల్లో 1838 ప్రాంతం నుండే వ్యావహారికం మొదలయినా 'హిత సూచని' పీఠిక (1862 లో ముద్రితం) లో వచన రచనకు వ్యావహారికం ఎలా ఉపయుక్తమో సామినేని ముద్దు నరసింహం నాయుడుగారు చర్చించి ఉన్నా, వీరేశలింగంగారు తమ నాటక, ప్రహసనాల్లో (1880-1890) వ్యావహారికం వాడినా, గురజాడ కన్యాశుల్కాన్ని (1897) వ్యావహారికంలో రాసినా, అది 'గ్రామ్య' మని భావించే పండితుల ఛాందస భావాల్ని సవాలుచేసి వారిని ఒప్పించి వ్యావహారికాన్ని కావ్యోపయోగిగా మార్చిన వారు మాత్రం గిడుగు వారే.

"కాని ఆ రోజుల్లో ఒక నాయకుడు అవసరమయ్యాడు. ప్రతి పక్షుల శక్తి సామర్థ్యాలు తెలిసి, నిర్భీకంగా సావధానంగా సాధికారికంగా ప్రతి గ్రంథంలోని ఆశ్వాసం-పద్యం-గద్యం అందులోని ప్రయోగ విశేషం-నిరూపించి, వాళ్ళని ఖండించి, స్నేహ మర్యాదలు నిలుపుకొంటూ వారిని సున్నితంగా ఒప్పించగల మేధావి అవసరమయ్యాడు. అలాంటి వారిలోనూ ఉత్సుకతకు మించిన సంయమనం, సత్యప్రియత్వం ఉన్నవాడు కావాల్సి వచ్చింది. చెల్లాచెదరై పోయిన ఆనాటి సంస్కర్తలు రామమూర్తిలో ఆ నాయకుణ్ణి చూశారు" అని జె. ఎ. ఏట్సు 1933 లో రాసిన 'స్మృతు' లనే ఆంగ్ల వ్యాసంలో రామమూర్తి నాయకత్వ లక్షణాల్ని స్మరించాడు.

మీాదు మిక్కిలి ఏట్స్ వంటి యూరోపియన్ పండితుణ్ణి పంతులుగారిలోని స్వేచ్ఛా ప్రియత్వం మానవతా దృక్పథం ఆకర్షించాయి. నిరంతర పరిశ్రమ, పాండిత్య గరిమలతో పాటు పంతులుగారికి అత్యద్భుతంగా ప్రసంగించే శక్తి ఉండేది. వాదనలో ఎంత తీక్ష్ణత ఉంటుందో వారి వాక్యాలలో అంత సౌకుమార్యం ఉండేది. ఆర్ద్రత ఉండేది. ఇలా ఒకే మనిషిలో శాస్త్ర పాండిత్యం, ప్రచారశక్తి రెండూ కలిసి ఉండటం చాలా అపురూపమైన విషయ మని కూడా ఏట్స్ తన వ్యాసంలో పేర్కొన్నాడు.

ఆయన వాగ్యుద్ధాలే చేశాడు కాని ఆయనకు తన విరోధు లైన సంప్రదాయ పండితులలో సాహిత్య సారం (Content) విష యంలో తగాదా లేదు. తనకు ప్రత్యర్థిగా గ్రాంథిక ఉద్యమాన్ని నిర్వహించిన జయంతి రామయ్య పంతులుగారితో కూడా ఆయనకు మైత్రి చెడలేదు. లేకపోతే ఆయనతో కలిసి మదరాసులో ఫోటో గ్రాఫ్ తీసుకుంటూరా! కాని ఉపన్యాసం చెప్పడానికి నిలబడినా, వ్యాసం కాని కరపత్రం కాని రాయటానికి మొదలెట్టినా మహా మహోపాధ్యాయులనైనా లెక్కించే మనస్తత్త్వం కాదు ఆయనది.

అంచేతనే ఆయన వ్యావహారికోద్యమ నాయకుడుగా విజయు డయ్యాడు. ఏట్స్ ప్రోత్సాహంతో ఉపాధ్యాయ సదస్సులలో (1907-10) మాట్లాడటానికి ముందే ఆయన తెలుగు సాహిత్యాన్ని ఒక కంట గమనిస్తూ వచ్చి ఉండవచ్చునని తెలుస్తోంది. సవర సంస్కృతి భాషల పరిశీలన ద్వారా ఆయనకు భాషలో ఉచ్చ నీచ భేదాలు లేవని తెలిసింది. సవర లందరూ ఒకే శైలిలో మాట్లాడు తారు, తెలుగు భాషలో ఈ విధంగా కాకుండా ఈ రెండు శైలు లున్నాయంటే చరిత్రలో వచ్చిన పరిణామాల కారణంగా ఏర్పడ్డవే తప్పా తెలుగు భాషకి కూడా ఇది సహజం కాదని ఆయన స్పష్టమైన

అభిప్రాయాన్ని ఏర్పరచుకొన్న దశలో ఆయన ఉపాధ్యాయ సదస్సుల్లో మాట్లాడారు.

గిడుగు వారి వాగ్వ్యధాలను మూడు దశల్లో వివరించవచ్చు.

*మొదటి దశ* (1906-1910)

ఈ దశలో గిడుగు గురజాడలకు వేటూరి ప్రభాకరశాస్త్రి గారితో పరిచయం మొదలైంది. ఇటీవల తెలిసిన కొన్ని వివరాల్ని బట్టి అప్పారావుగారికి గాని, రామమూర్తిగారికి గాని తెలియని ఒక విషయాన్ని ప్రభాకరశాస్త్రిగారు తెలియజేశారు: 'మన పూర్వులు ప్రబంధాలకు ఒక భాష, గద్య రచనకు మరొక భాష వాడుతుండేవారని, గద్య వ్రాసినదంతా వ్యావహారిక భాష అని, దానిని గ్రాంథిక భాషలోకి తర్జుమాచేసి పుస్తకాలు ప్రచురించిన వారు అపకారం చేస్తున్నా'రని.

ఈ గమనింపు తన సవర భాషా పరిజ్ఞానంవల్ల ఏర్పడ్డ అవగాహనతో సమానంగానే వుంది. అంచేత సమకాలికంగా పండితులు చేస్తున్న శబ్దాల సాధు-అసాధు మీమాంస చాలా నిరర్థకమని పంతులుగారు ఈ దశలో గుర్తించారు. అందుకే ఉపాధ్యాయులను పరోక్షంగా తమ భావ సరళికి అనుకూలంగా మార్చుకోవటం కోసం 'భాషలు మారుతాయి—తెలుగు విషయమూ అంతే' అని తమ ఉపన్యాసాల్లో వివరిస్తూ ప్రపంచ భాషల చరిత్రలతో ఉపాధ్యాయులకు పరిచయం కలిగించి, పనిలో పనిగా వ్యావహారికంలో పుస్తకాలను విద్యార్థులకోసం రాయమనీ అర్థించారు.

*రెండో దశ* (1910-1914)

రామమూర్తిగారి అభ్యర్థన ఉపాధ్యాయులను ఆకర్షించింది. కాని కొమ్ములు తిరిగిన సంప్రదాయ పండితులను రెచ్చగొట్టింది. 1910 లోనే అప్పారావుగారు 'గ్రామ్య శబ్ద విచారణ' అనే వ్యాసం

ప్రకటించి వ్యావహారికం గ్రామ్యం ఒకటి కావని, గ్రామ్యం వ్యాకరణ విరుద్ధ ప్రయోగం కావచ్చు కాని - వ్యావహారికం వ్యాకరణ బద్ధమేనని ప్రతిపాదించారు. 1911 లో శ్రీనివాసయ్యం గారు 'లాంగమన్స్ అరిత్ మెటిక్కులు' అనే గణిత పుస్తకాన్ని, సెట్టి లక్ష్మీనరసింహంగారు 'గ్రీక్ పురాణ గాథ' లనే పుస్తకాన్ని విద్యార్థుల కోసం రాశారు. కాని ఇంకా వ్యావహారికం బాగా అలవాటులోకి రాకపోవటంతో అది అటు గ్రాంథికమూ ఇటు వ్యావహారికమూ రెండూ కాక, ఉద్యమానికి అశక్త సహాయం చేసింది. వావిల కొలను సుబ్బారావుగారు ఈ గ్రంథాలపై ధ్వజమెత్తి వీటిలో ఉన్నది గ్రామ్యమే అని వాదించారు. అప్పుడు అయ్యంగార్ 'ప్రాంతీయ భాషల జీవన్మృతి సమస్య-ఒక విజ్ఞప్తి' అనే కరపత్రాన్ని 1912 లో విడుదలచేశారు. ఆధునిక విద్యాబోధనకు తగింది వ్యావహారికమే అని ప్రతిపాదించారు. అదే సంవత్సరం విజయనగరంలో 'ఆంధ్ర సారస్వత సంఘం' ఏర్పడింది. ఏట్సు అధ్యక్షులుగా 'తెలుగు టీచింగ్ రిఫారమ్ సొసైటీ' కూడా ఏర్పడింది. ఈ రెంటిలోనూ అప్పారావు, రామమూర్తులు ప్రముఖ కార్యకర్త లయ్యారు.

దీనితో మదరాస్ ప్రెసిడెన్సీ అంతటా ఒక కోలాహలం బయలుదేరింది. పిఠాపురం జమీందారు సూర్యారావుగారి ప్రాపకంతో గ్రాంథిక వాదాన్ని సమర్థించే సంఘం ఒకటి తయారయింది. జస్టిస్ పార్టీకి చెందిన త్యాగరాజ శ్రేష్ఠి (మదరాసు) వంటి పెద్దల అండదండలతో, జయంతి రామయ్య పంతులుగారన్న న్యాయవాది గ్రాంథికవాదుల్ని సమీకరించాడు. 1911-1912 లో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' కాకినాడలో ఏర్పడింది. వేదం వేంకటరాయ శాస్త్రిగారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, వావిలకొలను సుబ్బారావుగారు మొదలైన హేమాహేమీలు ఇందులో సభ్యు

లయ్యారు. 1912 లో ఒక పండిత సదస్సు జరిపారు. రామమూర్తి అప్పారావులు కూడా ఆహ్వానితులే. వెళ్ళి రామమూర్తి తెలుగు భాషా చరిత్ర మీద ఒక వ్యాసం చదివారు. సభలో అందరూ ప్రతి పక్షులే. కాని వేదం కాశీనాథశాస్త్రులు గారన్న ఒక సంస్కృత భాషావేత్త మాత్రం రామమూర్తి వాదం 'సబబు'గా ఉందని అన్నారు : 'ఈ భేదం వైదిక లౌకిక సంస్కృత భేదం లాంటిదే అన్నారు' శాస్త్రిగారు, రామమూర్తి వాదానికి సమర్థన దొరికింది.

ఆ రోజుల్లో వ్యాకరణ పితామహుడుగా భావించబడిన వారు మహోపాధ్యాయులు తాతా సుబ్బరాయశాస్త్రిగారు. శాస్త్రిగారు కూడా రామమూర్తిని సమర్థించారు. ఉద్దండ పండితులు రామమూర్తి వైపు సమర్థింపజూసినా 'గ్రాంథికవాదులు' మాత్రం రామమూర్తితో పోరాటానికే సిద్ధమయ్యారు. కాని ప్రభుత్వం ఇంకా వ్యావహారికానికే సుముఖంగా ఉంది.

అంచేత గ్రాంథికవాదులు మార్గాంతరాలు అన్వేషింప జూశారు. 1912 ఆగస్టు 3 న మద్రాసు గవర్నర్ సర్ ముర్రే హామిక్ గారికి ఒక పిటిషన్ పెట్టారు. గ్రాంథిక వ్యావహారిక శైలుల్లో విద్యార్థి తన అభీష్టం మేరకు రాయగలిగే అవకాశం ఇవ్వాలని కోరారు. గవర్నర్ వీరి కోరికను మన్నించాడు. తరువాత ప్రభుత్వంలో తమ పలుకుబడిని ఉపయోగించి ఒక పాఠశాల మొత్తం ఏ శైలిని కోరితే ఆ శైలిలో రాయవచ్చని అనుమతిని సంపాదించారు. రాయల సీమ ప్రాంతంలోని పంతుళ్ళూ, సర్కారుల్లో చాలామంది, గ్రాంథికాన్నే వరించారు. బడిపంతుల్లో చాలామందికి వ్యావహారికం అంటే ఏమిటో, రామమూర్తిగారి వాద సారాంశం ఏమిటో కూడా తెలియదు. ఇది 'దుష్ట చతుష్టయం' చేసిన ఘోరమని ప్రచారం కూడా మొదలయింది. అంచేత 'వ్యావహారిక వాదం' మళ్ళీ అపజయాన్ని పొందింది.

తాను చెప్పదలచిన విషయాలను గ్రంథరూపంగా వెలువరించి, ఉపన్యాసాలద్వారా వివరిస్తే తప్ప పండితుల్లో పరివర్తన రాదని గుర్తించాడు రామమూర్తి. అందుకే 'గ్రామ్య పద ప్రయోగం' (1912) అనే వ్యాసాన్ని, 'నేటి తేట తెలుగు' (1913) అనే మరో వ్యాసాన్ని ప్రచురించారు. తాను గ్రాంథిక భాషా స్వరూపం తెలిసే ఈ వాదం చేస్తున్నానని నిరూపించటం కోసం 'ప్రౌఢ వ్యాకరణం' ను రచించాడు (1913). వెనువెంటనే ఆంగ్లంలో 'ఎ మెమొరాండం ఆన్ మాడరన్ తెలుగు' అనే గ్రంథాన్ని ప్రచురించారు. ఆ గ్రంథంలోని కొన్ని విషయాల్ని చూద్దాం.

1. ప్రభుత్వం వారేమో మాతృభాషలో విద్యాబోధన సాగాల్సిన పిల్లల పుస్తకాలలోనే కాకుండా, ప్రభుత్వాధికారులు ప్రజలకు రాసే ఉత్తరాలలో, పంపే వర్తమానాలలో, పుస్తకాలలో, కరపత్రాలలో, వాణిజ్యం, వ్యవసాయం, పారిశుద్ధ్యం మొదలైన విషయాలు జనసామాన్యానికి తెలియజేయటంలో అన్ని రంగాలలోనూ వాడుక భాషను వాడాలని చెబుతున్నారు. కాని పండితులంతా సంస్కృతం మీదే మోజు చూపిస్తున్నారు. తెలుగును పెంపొందింప చెయ్యాలన్న ఆసక్తి వాళ్ళలో లేదు.

2. గ్రియర్సన్ చెప్పినట్టు జన వ్యవహారంతో సంబంధంలేని కావ్య శైలి కారణంగా అత్యధిక శాతం ప్రజలకు సాహిత్యంలో ఏ మాత్రం సంబంధం లేకుండా పోయింది. సర్ థామస్ మన్రో 1882 లో భాషాబోధన సామగ్రి విషయంగా చెప్పిన విషయాల్లో ఈనాటికీ ఏమీ మార్పు రాలేదు. ఆయన కోరిన అంశాలివి: (a) విద్యార్థి తాను సులువుగాను, బలంగాను, సరిగాను ఏదైనా చెప్పడానికి, రాయడానికి భాషాబోధన తోడ్పడాలి. (b) మనస్సులో అనుకొన్నది సొంతంగా చెప్పగలిగేలా చెయ్యాలి. (c) నిర్దిష్ట

శ్రోతలకు, నిర్దిష్ట లక్ష్యంతో చెప్పగలిగేటట్టు చెయ్యాలి. (d) క్రమబద్ధమైన ఆలోచనకు విద్యార్థి అలవాటుపడేటట్టు చెయ్యాలి. (e) వాస్తవ విషయాలను గురించి ఊహించగల శక్తి, లోక జ్ఞానం విద్యార్థిలో పెరగాలి. (f) ఒక విషయం మీద నుంచి దృష్టి మరలకుండా కొనసాగే అలవాటు కావాలి. (g) మనసుకు విషయ గ్రహణశక్తి బాగా అలవడాలి. ఈ సూచనల్ని నిజం చెయ్యాలంటే వాడుకభాష ఒకటే మార్గం.

3. 'ది ఇండియన్ ఎడ్యుకేషనల్ పాలసీ'లో చెప్పినట్టు 'విద్యార్థులకు నిర్ణయించే పాఠ్య పుస్తకాలు సులువుగా అర్థమయ్యే భాషలో రాసినవే కావాలి గాని పరిచయం లేని, కావ్యభాషా శైలిలో రాసినవి కాదు. అర్థమయ్యే భాష అంటే ప్రజలకు పరిచితమైన భాష. వాడుక భాషలో ఏక రూపత, ప్రామాణికత లేవని కొందరు వాదిస్తారు. ఇంగ్లండులో కూడా కింది వర్గాల వాళ్ళ పిల్లలు తమ తమ మాండలికాల్లోనే మాట్లాడుకొంటారు. కాని వాళ్ళందరికీ ప్రామాణిక భాష బోధిస్తారు. తెలుగులో కూడా ఆ మాదిరి ప్రామాణిక భాష ఉంది. దానిలో బోధించవచ్చు. ఉన్నతవర్గాల వారి వాడుకలో ఏక రూపత లేదని కొంద రంటారు. కాని కావ్య భాషలో ఉన్నంత రూపభేదం వాడుక భాషలో లేదు. కావ్యాలలో 'ఒకర్తె' అన్న మాటకు 52 రూపాంతరా లున్నాయి. 'ఒకడు' అనే శబ్దానికి 16 రూపాంతరా లున్నాయి. ప్రామాణికమైన తెలుగు వాడుక భాషలో ఉన్నపాటి వైవిధ్యం ప్రామాణిక ఇంగ్లీషు భాషలో కూడా వుంది.

4. తెలుగు బోధన సామాన్యం-ఐచ్ఛికం అని రెండు విధాలుగా ఉండాలి. ఐచ్ఛికం కేవలం ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చేయదలుచుకున్న వాళ్ళకు బోధిస్తే చాలు. సామాన్యం విద్యార్థులందరికీ తప్పనిసరిగా బోధించాలి. సామాన్యం ఆధునిక

భాషలోనే ఉండాలి. చరిత్ర, పౌరశాస్త్రం, భూగోళ శాస్త్రం మొదలైనవి ఈ కోవలోకే వస్తాయి. ఈ శాస్త్రాలు నేర్పే ఉపాధ్యాయుడే వివిధ విషయాల మీద తెలుగులో కాంపోజిషన్ రాయిస్తాడు. ఇలా చేస్తే ఆధునిక భాషకు అర్హమైన స్థానం ఇచ్చిన వాళ్ళమవుతాం.

ఈ గ్రంథానికి రెండు అనుబంధాల్ని కూడా పంతులుగారు రాశారు. మొదటి అనుబంధంలో పండితులు కర్మణి ప్రయోగాలు (Passive sentenecs) చేస్తారని ఉదాహరణలు చూపిస్తూ అసలు తెలుగులో కర్మణి ప్రయోగాలే లేవని క్రింది ఉదాహరణలు ఇచ్చారు :

సంస్కృతం : శ్రూయతాం; భగ్నం.

తెలుగు : వినుము; విరిగినది.

రెండో అనుబంధంలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు మదరాసులో జరిపిన (1912) సమావేశం తాలూకు తీర్మానాలను సహేతుకంగా ఖండించారు. విద్యార్థుల వాచక పుస్తకాలలో శృంగార రస ప్రధానమైన కావ్య భాగాలు ఎంపిక చేసే విషయంగా పండితులు వెల్లడించిన అభిప్రాయాలను గట్టిగా విమర్శించారు.

ఈ గ్రంథానికి ఖండనగా జయంతి రామయ్యపంతులు 'గ్రాంథిక వాద సమర్థనం' (1913) అనే గ్రంథాన్ని ఆంగ్లంలో రాశారు. ప్రభుత్వం ఎటువైపు నిర్ణయాన్ని ప్రకటించలేకపోయింది. కాని వ్యావహారిక పాఠ్యగ్రంథాల్ని మాత్రం అనుమతించింది. దీనితో గ్రాంథిక వాదులు (న్యాయవాదులు) ఊరూరా సభలు జరిపి ప్రభుత్వోద్యోగుల ఒత్తాసును సంపాదించారు.

ఇక ప్రభుత్వం తన మీది బాధ్యతను మదరాసు యూనివర్సిటీ మీదికి నెట్టింది. 1913 ఏప్రిల్‌లో మదరాసు విశ్వవిద్యా

లయం 'కాంపొజిషన్ కమిటీ' అనే ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి ఈ విషయంలో తుది నిర్ణయం చెప్పమన్నారు. 1913 ఆగస్టు 2 న సంఘం మొదటి సమావేశం జరిగింది. సంఘంలో ఇరు పక్షాల ప్రతినిధులూ చెరి సగంగా ఉన్నారు. సంఘ సభ్యత్వం విషయంలో గ్రాంథిక వాదులు 'రాజకీయం' నడిపి అసలు 'ప్రమాణ పదాలు' ఏవో గుర్తించే 'ప్రమాణాలు' లేనందువల్ల ఏ తీర్మానమూ చెల్ల నేరదని వ్యావహారికాన్ని అడ్డుపెట్టారు.

అప్పుడు అప్పారావుగారు 5, 6 నెలలు శ్రమించి 'డిసెంటు పత్రాన్ని (1914, ఏప్రిల్ 20) ప్రచురించారు. ప్రాచీన, నవీన వచన రచనల్లో వ్యావహారికం ఎలా వాడుతున్నారో నిరూపించి ప్రమాణ మాండలికాన్ని నిరూపించే ప్రమాణాలూ చూపారు.

1914 లోనే రామమూర్తిగారు 'నిజమైన సంప్రదాయ' మనే గ్రంథాన్ని ప్రచురించారు. ఇంత మాత్రం చాలదని 1914-15 నడుమ ఒక సంవత్సరంపాటు దేశాన్నంతా సుడిగాలిలా చుట్టి బరంపురం నుండి బళ్ళారిదాకా ఉన్న కళాశాలల్ని, పాఠశాలల్ని, సందర్శించి ఉపాధ్యాయ విద్యార్థి పండిత సమావేశాల్ని ఏర్పరచి సంప్రదాయ పండితులతో వాద ప్రతివాదాలు జరిపి వారిని తమ ఉద్యమానికి అనుకూలంగా మార్చుకోవటం ప్రారంభించారు. ఎప్పటి కప్పుడు కావాల్సిన ఉదాహరణలను (పూర్వకవి / శాసన ప్రయోగాల్ని) అందించటానికి సీతాపతిగారు పుస్తకాల కట్టలతో తండ్రికి సహాకరిస్తూ ఉండేవాడు. ఒక బండికి సరిపడ్డ పుస్తకాలతో తాళ పత్ర గ్రంథాలతో పంతులుగారి భాషా జైత్రయాత్ర వారి జీవితంలో ఒక అధ్యాయమైంది. పండితులు ఒప్పుకొన్నాక అంతటితో వదలిపెట్టకుండా తన వాదాన్ని వారు అంగీకరించినట్టు, తమ దగ్గర ఉన్న ఆధారాలను వారు ప్రత్యక్షంగా చూసినట్టు వారి దగ్గర ధ్రువ పత్రాలను కూడా తీసుకున్నారు.

పాపం అప్పారావుగారికి ఆరోగ్యం క్షీణించకపోతే రామమూర్తితో తిరిగే వాడే. అందుకే మిత్రుడితో మరణశయ్య మీదున్న అప్పారావు ఇలా అన్నారు: "రామమూర్తీ! ఫైట్ అవర్ లాంగ్వేజ్ రిఫార్మ్ బ్యాటిల్ టు ది ఫినిష్" (రామమూర్తీ! మన భాషా సంస్కార యుద్ధాన్ని కొసదాకా పోరాడు).

తుది దాకా పోరాడమన్న మిత్రుడి చివరి కోరికను రామమూర్తి కొన ఊపిరి ఉన్నదాకా (చూ. తుది విన్నపం) సాధించి తీర్చాడు.

*మూడో దశ* (1915-1940)

అప్పారావు మరణించిన కొన్ని రోజులకే రాజమండ్రిలో, తర్వాత కొన్ని నెలలకు (1916) కొవ్వూరులో, రామమూర్తి బహిరంగ సభల్లో ఉపన్యసించాడు. ఈ ఉపన్యాసాల ప్రభావంతో వీరేశలింగంగారు కూడా వ్యావహారికవాది అయ్యారు. 1919 ఫిబ్రవరి 28 న వీరేశలింగంగారి అధ్యక్షతలో 'వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజం' ఏర్పడింది. జయంతి గంగన్నగారితో పాటు, రామమూర్తిగారూ ఒక కార్యదర్శి అయ్యారు. వ్యావహారికానికి ఒక సమగ్ర వ్యాకరణం రాస్తానన్న పంతులుగారు తరువాత కొన్ని నెలలకే చనిపోయారు.

'మనం రాయలేమా! రాద్దాం' అన్నాడు సీతాపతి. 'పంతులుగారిలాంటి మహాకవి రాస్తే జనం ఆదరిస్తారు నేను రాస్తే గ్రామ్యాచార్యుడు రాసిన గ్రామ్యవ్యాకరణ' మంటారని రామమూర్తి వాపోయారు. ఉద్యమాన్ని ఆపకూడదు. అందుచేత ఒక పత్రిక అవసరమని గుర్తించారాయన. 'తెలుగు' అనే మాస పత్రికను ప్రారంభించారు.

తమ పత్రిక ధ్యేయాన్ని గురించి పంతులుగారిలా రాశారు: "'దేశభక్తి అంటే మా దృష్టిలో భాషమీద అభిమానమే,

మాట్లాడుతున్న భాషను కాదని మృత భాషను పూజించటం ఎలాంటిదంటే ఆకలితో మాడి చస్తున్న సాటి మనిషికి అన్నం పెట్టకుండా చనిపోయిన వారి పేరుతో బ్రాహ్మణులకి శ్రాద్ధ భోజనం పెట్టడం లాంటిది.''

గిడుగు వారి బుర్రనిండా ఎన్ని ఆలోచన లున్నాయో చూడండి. ఆ ఆలోచనలు ఇప్పటికైనా అలాగే మిగిలిపోయాయి. రాబోయే సంచికలలో 'మేము విచారించదలచిన విషయా' లంటూ తమ పత్రిక మేనిఫెస్టోని కూడా అందించారు.

1. తెలుగు మాటల సాధుత్వ-అసాధుత్వముల నిర్ణయము, అసాధువు లనుకొన్న అనేక శబ్దములు సాధువు లనుకొనుటకు ప్రమాణములు. 2. నన్నయ్య భారతములోని పదముల పట్టిక. 3. తెలుగు పదముల రూపాంతరములు. 4. సంస్కృత పదముల రూపాంతరములు 5. అంత్య వర్ణములనుబట్టి (అకారాంతాదిగా) ఏర్పరచిన తెలుగు మాటల పట్టిక. 6. గ్రంథములలో పాఠాంతర ములు. 7. తెలుగు భాషా చరిత్రమునకు కావలసిన సామగ్రి. 8. నేటి తెలుగు భాషకు లక్షణము ఏర్పరచుటకు కావలసిన సామగ్రి. 9. మన పూర్వులు వ్రాసిన వచన రచనకు ఉదాహరణ ములు. 10. తెలుగులో చేరిన అన్య దేశ్యములు. 11. తెలుగు మాటల వ్యుత్పత్తి. 12. తెలుగు నిఘంటువులలోని లోపములు. 13. తెలుగు వ్యాకరణములలోని లోపములు. 14. తెలుగు ఛందస్సు. 15. దేశము, జాతి వృత్తి మొదలైన వాటిలో భేదమును బట్టి తెలుగు భాషలో కలిగిన భేదములు. 16. సర్వజన సామాన్యమైన విషయములు బోధించే పుస్తకములు. 17. నేను తెలుగు గ్రంథము లలో వాడుతూ ఉన్న భాష. 18. సారస్వత విమర్శ. 19. భాషా తత్త్వము 20. అన్యదేశముల సారస్వతము. 21. విద్యాభివృద్ధి.

గిడుగువారు 1920-38 ల నడుమ చేసిన సాహిత్య కృషిపై అంశాలన్నింటికీ సంబంధించినది. ఆయన రాసిన పీఠికలు, పత్రికలకు రాసిన వుత్తరాలు, బహిరంగ సభల్లో చేసిన ఉపన్యాసాలు అన్నీ విద్యాభివృద్ధిని - వ్యవహార భాషను కేంద్రంగా కల్గినవే.

1933 లో వారి జన్మదినోత్సవ సందర్భంగా విడుదల అయిన నాల్గు గ్రంథాలకు సంబంధించి, అందులో ముఖ్యంగా 'గద్య చింతామణి'కి సంబంధించిన సామగ్రి సేకరణ కోసం తంజావూరు వెళ్ళడం (1919), దేశంలోని భిన్న గ్రంథాలయాలను, కవులను, విమర్శకులను పండితుల్ని కలుసుకోవటం - ఇదే వారి నిత్యకృత్యం అయిపోయింది. వేటూరి వారికి రాసిన వుత్తరాల్నిబట్టి (1924-28) వేటూరి వారి గ్రంథ సహాయం కూడా చాలా పొందినట్లు తెలుస్తోంది.

"వాడుక భాషలో రచించిన వచన గ్రంథముల వర్గీకరణము చేసి...అన్నిటి పేర్లు జాబితా వ్రాయవలసి ఉన్నది. (కట్టకడపటి పుటలో నాకు తోచినట్లు వర్గీకరణము చేసినాను. మీరు సవరించవచ్చును) తెలిసినంతవరకు కర్తల కాలము వారి పేర్లు చెప్పవలెను. వాటిలో ఏదైనా ఒక 'పట్టు' ఎత్తి వ్రాయవలయును..." (వేటూరి వారికి రాసిన వుత్తరం 7-3-24).

అని రాసి వుండటం గమనించాలి. ఇలా ఎవరి దగ్గర ఏ సహాయం కావాలో అన్నీ పొందుతూ కూడా గ్రాంథిక వ్యావహారికం విషయంలో మాత్రం అలాంటి ప్రభాకరశాస్త్రిగారిని కూడా మినహాయించ లేదు. అదే వుత్తరంలో చూడండి :

"ఈ గ్రంథమున్నూ, మీ సాయమున కావలసిన "నిజమైన వచన రచనా సంప్రదాయము"న్నూ కాక, "కృతక గ్రాంథికాంధ్ర విజృంభణ" మనేది మరి ఒకటి కూడా నేను రచించుటకు సంకల్పించి ఉన్నాను. నూరుగురు కృతక గ్రాంథికాంధ్ర రచయితల

భాషవిమర్శించి వారు పుట్టించిన కృతక భాష ప్రకటీకరిస్తాను. చిన్నయసూరి మొదలుకొని చిలకమర్తి లక్ష్మీనరసింహము వరకున్నూ, వేదము వేంకటరాయశాస్త్రి, పురాణపండ మల్లయశాస్త్రి, నేతి సుబ్బరాయశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి—ఇట్టి పండిత నామధారులు; ఆంధ్ర వాల్మీకులు వడ్డాది సుబ్బరాయ కవి వంటి కవులు; కొమర్రాజు లక్ష్మణరావు, వంగూరి సుబ్బారావు, చెలికాని లచ్చారావు, జయంతి రామయ్య, చిలుకూరి వీరభద్రరావు వంటి విమర్శకులు, నవలా కర్తలు, బడి పుస్తకములు రచించిన వారు, పానుగంటి లక్ష్మీనరసింహము వంటి నాటక నిర్మాతలు, వీరందరి గ్రంథములు చూచినాను. అపశబ్దాల క్రింద గీట్లు గీసి ఉన్నాను. అవి అన్ని ఎత్తి వ్యాసరూపమున ప్రకటించవలెను. వాడుక భాషను దూషించి అపరిచితమైన ప్రాచీనాంధ్రములో రచించే వారి కందరికీ ప్రమాదము తప్పనిది. మీకయినా అంతే. నాకయినా అంతే. మీకన్నా ఎక్కువగా ప్రాచీనాంధ్రమును శోధించి తెలుసుకొన్న 'పండితుల'ను నేను ఎరగను. ఇచ్చకానికి చెప్పిన మాట కాదు. నమ్మండి. అయినా మీ వ్రాతలో కూడా కృతక భాష ఉన్నది. లేకపోలేదు. అందుకు తక్కిన వారితో పాటు మీరూ నిందార్హులు''

రామమూర్తిగారి పరిశీలనలో ఎత వస్త్వాశ్రయ లక్షణం ఉందో గుర్తిస్తే ఆశ్చర్యమవుతుంది. ఆయన తన రచనను-భాషను తానే విమర్శించుకున్న సందర్భం వుంది.

''నా భాష పందొమ్మిదో శతాబ్దిదనిన్ని అది నేటి వారికి అనుకరణ యోగ్యము కాదనిన్ని కామేశ్వరరావుగారన్నారు. అవును. నేను ఆ శతాబ్దిలో పుట్టి పెరిగిన వాడను గనుక అప్పటి భాష నాకు అలవాటయినది. వారి భాష వారి మనుమలకు పాత భాష అవుతుంది. అందులో వైపరీత్యమేమీ లేదు. హానీ లేదు,

ఒకరి మాట ఒకరికి తెలియకపోతే కదా! స్వస్తి!'' (కామేశ్వర రావుగారి 'వ్యావహారిక రచనకు కొన్ని నియమాలు' గ్రంథానికి వ్రాసిన పీఠిక 16-12-38)

అంచేత రామమూర్తిగాను సత్యాన్వేషిగా వాక్ యుద్ధాలు చేశారు తప్పా ఆయనకు శత్రువు లెవరూ లేరు. 1922 లో సీతా పతితో కలిసి రాసిన 'అప్పకవీయం' పీఠికలోను, 1925 లో రాసిన 'మిథ్యాపవాదం' లోను, పంతులుగారు స్థాపించింది వ్యావహారి కంలో రాయటమే తరతరాల సంప్రదాయమని.

1925-28 ల నడుమ సీతాపతితో కలిసి పంతులుగారు నన్నయ భారత ప్రతుల్ని పోల్చిచూసే పని మొదలు పెట్టారు. మూలపాఠాన్ని నిర్ణయించాలని ప్రయత్నం. 1924 లో రాసిన 'రాజరాజు కాలమందున్న తెలుగు భాష' అన్న వ్యాసంలో సమ కాలీన శాసనభాష - భారతభాష ఒకటిగానే వుందన్నారు. ఆ అభిప్రాయం సిద్ధాంతం కావాలంటే భారతంలోని మూలపాఠ పరి ష్కరణ కావాలి. ఈ పని చేస్తుండగానే, శిష్యుడు చిలుకూరి నారాయణరావుగారు పిహెచ్. డి. కోసం పరిశోధనచేస్తున్నవాడు కాబట్టి వచ్చి అడిగినందువల్ల తమ దగ్గరున్న సామగ్రినంతా ఇచ్చే శారు. నారాయణరావుగారికి 1929 లో పిహెచ్. డి. వచ్చింది. అదే తెలుగు దేశంలో వచ్చిన మొట్టమొదటి డిగ్రీ.

అరసవిల్లి గ్రామంలో గోదా నరసయ్యగారన్న పండితు డున్నాడు. ఆయనకి లెక్కలేనన్ని కావ్యాలు కంఠస్థం. బండ్లకొద్దీ కావ్య ప్రయోగాలను కట్టలుగా రామమూర్తికి ఆయనా అంద జేశారు. వీటన్నిటి సాయంతోనే ఆయన సమగ్ర నిఘంటు నిర్మా ణానికి కూడా ప్రయత్నం చేశారు.

అయినా ఆయనకున్న వినయ సంపద చాలా గొప్పది. 1934 లో సర్వేపల్లి రాధాకృష్ణగారి అధ్యక్షతలో నవర నిఘంటు

వును విక్రమదేవవర్మగారికి పంతులుగారు అంకిత మిచ్చారు. ఆ సభలో పంతులుగారు "సవర భాషా లక్షణము తెలిసినంత విస్తారముగాను, స్పష్టంగానూ నాకు తెలుగు భాషా లక్షణము తెలియదనే చెప్పవలెను" అని అన్నారంటే ఆయన తమ వాగ్యుద్ధాలను ఏ దృష్టితో సాగించారో అర్థం చేసుకోవచ్చు.

1933 లో పంతులుగారి జన్మదినోత్సవాలు జరుగుతుండగా ఒక పుస్తక ప్రదర్శనం జరిగింది. గిడుగు వారు కొన్ని గంటలసేపు ఆ ప్రదర్శనలో ఉండి ప్రతి పుస్తకాన్ని వివరంగా పరిశీలించారు. వాటిలో ఏదో ఒక గ్రాంథిక పుస్తకం వుంది. ఆ పుస్తకాన్ని ఎత్తి 'ఇది కూడా ఇక్కడికి ఎందుకు వచ్చింది?' అన్నారట ఆయన. తన వాదంలో ఆయన కంత నిబద్ధత.

ముందు చర్చించిన టేకుమళ్ళ కామేశ్వరరావుగారి పుస్తకం కోసం పీఠిక రాయమని పంతులు గారిని ఆయన కోరాడు. 'వ్యావహారిక భాషకు నియమాలు లేవని, ప్రమాణ భాష అనేది లేదని, రాస్తా' నన్నారట ఆయన ముందుగానే!

కాబట్టి గిడుగు వారాశించింది కేవలం సంధి నియమాల్ని సడలించిన గ్రాంథిక భాషను కాదు. ఆయన దృష్టిలో 'ప్రమాణ' రూపం కాలక్రమంలో ఏర్పడేదే తప్ప, ఒకరి వ్యవహారం వల్ల రూపు దిద్దుకొనేది కాదు. భాషాశాస్త్ర సిద్ధాంతాలు ఈనాడు పెరిగినంతగా పెరగని ఆ రోజుల్లోనే భాషలో 'ప్రామాణ్యం' మీద పంతులుగారు రాసిన విషయాలు అద్భుతంగా ఉన్నాయి.

1935-38 ల నడుమ పంతులుగారి సంగ్రామం 'సూర్యరాయాంధ్ర నిఘంటువు' మీద. తొలుత రామమూర్తిగారినీ ఒక ఉప సంపాదకుడుగా ఉండమన్నారు. "అయ్యా! మన మతాలు వేరు. నేను ఔనన్నది మీరు కాదంటారు..." అని ఆ పని నుంచి తప్పించుకొంటూ "మీరు గ్రంథాన్నంతా తయారుచేసిన తర్వాత

నేను వచ్చి దానిలో చేర్చవలసినవి. తొలగించవలసినవి సప్రమాణ ముగా తెలియజేస్తాను. నా ఉపదేశము మీరు అంగీకరించినప్పుడు ఒక్కొక్క అంశమునకు ఒక్కొక్క రూపాయి చొప్పున ఈనాము దయచేయవలయును'' అని అన్నారంటే నిఘంటు నిర్మాణ విష యంలో వారికెంత నిజాయితీ ఉందో చూడండి.

ఇప్పటికైనా ఆ నిఘంటువును సవరించి మనం సమగ్ర నిఘంటువును తయారుచేసుకోవాల్సి వుంది. శబ్దరత్నాకరం మీద సూర్యరాయాంధ్రం కేవలం ఇంప్రూవ్‌మెంటు తప్ప సమగ్రం కాదు. నిర్దుష్టం అంతకంటె కాదు—అన్న వారి అభిప్రాయాన్ని మనం మరవరాదు.

వారు 'తెలుగు' పత్రికలో వ్రాసిన ఆరు ఆంగ్ల వ్యాసాలు చాలా ముఖ్యమైనవి. 'వ్యాసావళి' గ్రంథంలో (1933) అవి సంగ్రహించబడ్డాయి. జీవభాషను వాడటానికి స్వేచ్ఛ ఉండాలని, జీవభాషను ఎవరు నియమించలేరని, వాడుక భాషను లిఖిత భాషను సన్నిహితం చెయ్యాలని ప్రతిపాదిస్తూ ప్రజాసాహిత్యం (1, 2, 3) మీద మూడు వ్యాసాలు రాశారు. ఆ వ్యాసాల సారాంశమిది :

వర్తమానం నుంచే సాహిత్యం ప్రేరణ పొందుతుంది. వస్తువులోనే కాకుండా రూపంలో కూడా వర్తమానతనే అది స్వీకరిస్తుంది. మనిషి ఆచార్య వ్యవహారాలకు దృక్పథాలకు చరిత్ర ఉన్నట్లే మనిషి భాషకు కూడా జనానాంతరాల చరిత్ర వుంది. ఈ మార్పు ఎప్పుడూ అభ్యుదయం వైపే తప్ప భాషలో మురిగి పోవటం, క్షీణించటం లేనే లేవు.

అంచేత 'ప్రజాసాహిత్యం' అంటే ఏమిటో అర్థం చేసుకునే దశలో మన వారు లేరు. 'తెలుగు భారతం గుళ్ళలోను, మార్కెట్ల లోను చదువుతున్నారు గదా! అని బుకాయించకండి. ఎవరో పండితుడు చదివితే మరొకడు దాన్ని వాడుక భాషలో వివరిస్తూ

ఉంటే జన సామాన్యం అర్థం చేసుకొంటోంది. ఇది కాదు ప్రజా సాహిత్యమంటే, బొబ్బిలి కథ పాడుతుంటే ఎంతమంది గుమి గూడుతారో చూశారా! పాడే వాడికి చదువు రాదు. వినే వాళ్ళం దరూ అవిద్యావంతులే. అక్కడ ఒక మూల్లో నుంచుని ఒక పండి తుడు కూడా ఈ గ్రామ్య ప్రయోగాన్ని చూస్తూ ఆనందించ వచ్చు. అదీ ప్రజా సాహిత్యమంటే అని పంతులుగారు 'జానపద విజ్ఞానం' పరిశోధన మూలాన్ని స్పృశించారు.

ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లో మతపరమైన గ్రంథాల్ని దేశ భాషల్లోకి అనువదించటం తప్పుగా భావించబడిందని చెబుతూ టెండల్ (1526) విషయం ప్రస్తావించారు. లండన్ బిషప్, బైబి లుని ఇంగ్లీషులోనికి అనువదించాడని టెండల్ ని కాల్పించినా అనంతర కాలంలో ఆ అనువాదమే ఇంగ్లీషువారికి శిరోధార్యమయిన మహా గ్రంథమయిన విషయాన్ని ప్రస్తావించి జన సామాన్య భాషలో రాయటమే ఆయన చేసిన గొప్ప కార్యమన్నారు.

రామమూర్తిగారి సాహిత్య భవిష్యదర్శనం చాలా గొప్పది. సమకాలికంగా తెలుగు కవులంతా ఎక్కువ అగ్రవర్ణాల వారే కాగా పాశ్చాత్య దేశాల్లో 'నవ్యసాహిత్యం' పుట్టగానే సమాజంలో దిగువ తరగతులలో ఉన్న ప్రజల నుండి కవులు పుట్టు కొచ్చిన విషయాన్ని ఆయన చాలా చోట్ల స్మరించారు బనియన్- కళాయి పనివాడు: ఫాక్స్- చెప్పులు కుట్టే పనివాడు; జాన్ స్టోన్- దర్జీ పనివాడు.

'ప్రజాస్వామ్యంలో ప్రతి సంస్థా ప్రజల పరం అవుతుంది. మతాలు, వర్గ స్వభావాలు అడుక్కిపోతాయి - ప్రజా ప్రభుత్వం, ప్రజా విద్య, రెండూ ఒకదానితో ఒకటి ముడిపడి వుంటాయి. ప్రజా విద్య ప్రజాసాహిత్యం మీద, ప్రజల తాత్త్వికదృష్టిమీద,

విజ్ఞానం మీాద, భాష మీాద ఆధారపడి జనసామాన్యానికి అందు బాటులోకి వచ్చే మాధ్యమికం అవుతుంది' అని కూడా వారు చెప్పారు.

భారతీయులు ఈ విచిత్ర పరిస్థితిలో ఎందుకున్నారో చెబుతూ "భారత దేశంలో తమకు తెలిసిన భాషలో జ్ఞానాన్ని సంపాదించు కోగలగటమన్న ప్రాథమిక హక్కు ఒకటి ఉన్నదని కూడా చాలా మందికి తెలియదు. దీని ఫలితంగా ప్రాంతీయ భాషలేవీ పూర్తిగా ఎదగలే' దన్నారు. అలా ప్రాంతీయ భాషల్లో తమ మత ప్రచారం చేసిన గౌతమబుద్ధుడు (పాళీప్రాకృతాలు), ధ్యానదేవ్, నామ దేవ్, తుకారామ్ మొదలైన మహారాష్ట్ర భక్తులు మనకు మార్గ దర్శకులని కూడా అన్నారు.

జస్టిస్ రెనడే అభిప్రాయాన్ని ఉద్ధరిస్తూ 'వాళ్ళకి సంస్కృతం రాదు. కాని వారిలో కవిత్వం వుంది' అంటూ తులసీదాస్ రామాయణాన్ని, రవీంద్రనాథ్ ఠాగూర్ రచనల్ని జీవభాషా రచనలుగా ఉదాహరించారు.

మరాఠీ, హిందీ, బెంగాలీ సోదరుల్లాగే తెలుగువారు కూడా 'చలిత్' భాష (వాడుక భాష)ను సాహిత్య మాధ్యమికంగా మలుచుకోవాలన్నారు.

గిడుగువారు తమ బాలకవిశరణ్యం మొదలైన నాల్గు గ్రంథాలలో నాలుగు దారుల్లో వ్యావహారికవాద స్థాపన గావించారు. 1. పండితులు వైద్యులు కారు. కారాదు, ఎవరికీ గ్రాంధిక భాష రాదు (ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం),

2. ప్రాచీన వచన గ్రంథాలలో వ్యావహారికమే వుంది (గద్య చింతామణి).

3. కవుల ప్రయోగాలే వ్యాకరణంకన్నా ప్రామాణికాల్లు (బాలకవి శరణ్యం).

4. ఆంధ్రసాహిత్యం కూడా ప్రపంచ సారస్వతం లాగానే మారింది. (వ్యాసావళి).

బాలకవి శరణ్యంలో పంతులుగారు 192 పంక్తుల నాందీ కవిత రాశారు. రామమూర్తిగారి కవితాశక్తి ఎలాంటిదో ఈ పద్యం చూడండి.

ఏయమ్మ చన్నుగుడువన్
వాయర్చుచు నేర్తురెల్ల బాసలు భువిలో
నాయమ్మ భక్తివేడుదు
మాయ దొలంగించి భాష మర్మము దెలుపన్.

ఋగ్వేద మంత్రాన్ని మొదట పంతులుగారు ఉదాహరించారు.

యస్తే స్తనః శశయో యో మయో
భూర్యేన విశ్వాపుష్య శివార్యాణి
యోరత్నధా వసువిద్యః సుదత్రః
సరస్వతి తమిహధాతవేకః.

సరస్వతి ఏది కోరినా ఇస్తుందని తాత్పర్యం. పంతులుగారు 'భాషా మర్మాన్ని' తెలుపమని సరస్వతిని ప్రార్థించాడు.

'సభిక' శబ్దం దగ్గర రామమూర్తిగారు చేసిన చర్చ (చూ. భాషా భేషజం. పు. 131-134) వారికి సరస్వతీ కటాక్షం సంపూర్ణంగా కలిగిందని నిరూపించింది. ద్యూతకృత్తులు వేరు, జూదరులు వేరని చెబుతూ వారు చూపిన ఉపపత్తులు అమోఘంగా వున్నాయి.

'శిష్ట' శబ్దాన్ని నిర్వచిస్తూ మహా భాష్యాన్ని దృష్టిలో ఉంచుకొని వారు రాసిన బాలకవిశరణ్య నాందీ పద్యాలు వేరే గ్రంథంగా విమర్శకు యోగ్యాలు.

శిష్టులంటే వ్యాకరణం చదవకుండానే సలక్షణ భాషను మాట్లాడేవారన్న మహా భాష్యాభిప్రాయాన్ని పంతులుగారు గ్రహించే తుది విన్నపంలో ఇలా అన్నారు :

"మన ప్రాచీన కావ్య భాష వైదిక భాష వంటిది. వ్యావహారిక భాష లౌకిక భాష వంటిది. లౌకిక భాషకు లక్షణం చెప్పిన పాణిని కాత్యాయనుడు, పతంజలి లోకంలో ఉన్న వాడుక భాష, ప్రమాణంగా గ్రహించి సూత్రాలు వార్తికాలూ రచించారు కాని వాల్మీకి వ్యాసాదులు రచించిన గ్రంథాలలోని భాషను ప్రమాణంగా చూపించ లేదు"

ఈ అభిప్రాయాన్ని గిడుగు వ్యాఖ్యాత లెవరూ ఇంకా అర్థం చేసుకున్నట్టు లేదు.

"భాషాతత్త్వ జిజ్ఞాస, భాషా చరిత్ర జిజ్ఞాస మన ఆంధ్ర పండితులకు లేనే లేదు...గనుక మన తెలుగు భాషకు, తెలుగు గ్రంథములకు ఇట్టి దౌర్భాగ్యము పట్టినది. ఉపదేశకులు మార్గదర్శకులు, ఆచార్యులు తత్త్వదూరు లయినపుడు లోకమునకు అపరిమితమయిన హాని కలుగునని మనము జ్ఞప్తియందుంచుకోవలెను. భాషాతత్త్వమెరుగనివారు భాషా పండితులు కాజాలరు. అట్టివారు తాము మోసపోయి ఇతరులను మోసపుచ్చి లోకమునకు చాలా కీడు చేస్తున్నారు. దుర్బుద్ధి చేతకాదు. అజ్ఞానము చేత."

అని పండితుల భాషా భేషజాన్ని (మోసాన్ని, వైద్యాన్ని) పంతులుగారు జీవితాంతమూ నిరసిస్తూనే ఉన్నారు.

## అధ్యాయం 4

# మహితాత్ముడు

"మనకు కావలసినది 'శాంతి' నాకు అలవడ్డది కాదు. ఉత్త మాట లెందుకు? సంశయములు మెండైనవి. తత్త్వము కోసము ఎండమావుల వెంటబడ్డాను. తోవా తెన్నూ కనబడదు ప్రయాణమునకు సిద్ధపడుతున్నాను. బయలువెడలిపోక తప్పదు. పోయే దెక్కడికో తెలియదు."

[వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి రాసిన లేఖ 11-1-1928]

ఒక వైపు గ్రాంథికవాదులతో సంగ్రామం. మరో వైపు నవరభాష మీద చేయదలచిన పని పూర్తి కాలేదు. మనసు విశ్రాంతిని పొందడం లేదు. ఆ దశలో రాసిన వాక్యాలివి. సవర గ్రంథాల ప్రకటనతో ఒక కోరిక తీరింది. నవ్యసాహిత్య పరిషత్తు (1936) ఏర్పడి తన ఆలోచనలు కార్యరూపం దాల్చగానే రెండో కోరిక తీరింది.

కాని ఆయన 'శాంతి' లేకపోయిందన్న విషయం ఆయనలోని అంతర్మథనానికి సంబంధించింది. ఆయన జీవితంలోని సంఘటనల్ని పరిశీలించినా ఆయనలోని 'వ్యక్తి' కనిపిస్తాడు. కొన్ని సంఘటనల్ని ముందే చర్చించాను.

పర్లాకిమిడిలో ఆయన మిత్రు లెవరూ లేరు. ఒక్కరే ఉండేవారట - సీమనపల్లి రమణయ్యగారని బడిపంతులు వారిద్దరి స్వభావాలు ఒకటిగానే ఉండేవి. సమాజంతోపాటు తమ జీవితాల్ని మార్చుకోవాలి అన్న తపన ఉండేది. కాని ఇతరుల్ని మార్చాలని మాత్రం వారు ప్రయత్నించేవారు కారు. తమ కిష్టం లేని సందర్భం నుంచి తప్పుకొనేవారు. కాని ఈ లోపల తమకు

నచ్చని వ్యక్తుల మీద ప్రవృత్తుల మీద వాళ్ళలో ఒక ఏహ్యా భావం గూడు కట్టుకుంటూ పోయేది. ముఖ్యంగా మనుష్యుల నీతి వర్తనం విషయంలో ఇది మరింత స్ఫుటంగా బయటపడేది. ఒక్కొక్క సారి వీళ్ళ ఇద్దరి ప్రసంగాలు ఎంత కర్కశంగా ఉండేవంటే ఆ విన్న ఇతరులు భరించలేనంత. అలా అయినా వాళ్ళ హృదయాలలో తోటి మనుష్యుల మీద ప్రేమ మాత్రమే ఉండేది. వాళ్ళ అభ్యుదయాన్ని మాత్రమే వాళ్ళు కోరేవారు.''

ఈ అభిప్రాయాలు చెప్పినవారు శ్వయానా పంతులుగారి మేనల్లుడు కాళ్ళకూరి సూర్యనారాయణగారు (1955 : అధ్యా-6)

*శిష్యులు - అపరాధాలు*

రామమూర్తిగారి చరిత్ర అంతా ఒక ఆదర్శ ఉపాధ్యాయుడి కథే. ఆయనకు వ్యక్తిగత జీవితమంటూ ఏదీ లేదు. అందుకే ఆయన చుట్టాలు-శత్రువులు విద్యార్థులే-పండితులే.

1905 ప్రాంతంలో ఎఫ్. ఎ. చదువుకోటం కోసం తాప్పీ ధర్మారావు పర్లాకిమిడి కాలేజిలో చేరాడు. తొలి రోజున తరగతి గదిలోకి రాగానే పంతులుగారు ధర్మారావును చూసి 'మొఖానికి బొట్టు లేదేం!' అని విరుచుకు పడ్డారు.

ధర్మారావు లేచి నుంచుని 'నేను నాన్ బ్రాహ్మన్నండి' అన్నాడు.

'ఏం అయితే బొట్టుక్కర లేదూ?' అని మళ్ళీ గురువుగారు గర్జించారు. అలాగని బొట్టుపెట్టుకు రమ్మని చెప్పనూ లేదు. 6 నెలలపాటు క్లాసు వైపు వీపుపెట్టి పిల్లల్ని ఎవర్నీ చూడకుండా పాఠాలు చెప్పారు.

ఇలా మొదలయింది ఆ గురుశిష్యుల సంబంధం.

ఒక రోజున మ్యాపులో 'స్పార్టా' చూపించమన్నారు. ధర్మారావు చూపాడు. అంతే ప్రియశిష్యుడై పోయాడు.

మరొక రోజున అదే ధర్మారావు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాడు. తన చేతినున్న ట్రంపెట్ తీసి బల్ల మీద పారేసి ఇక మీ క్లాసుకు రానంటూ వెళ్ళిపోయారు.

అలా ఉండేవి ఆయన ప్రేమాభిమానాలు.

* * *

1908 ప్రాంతంలో అక్కడే ఎఫ్. ఎ. చదువుతూండిన చిలుకూరి నారాయణరావు చురుకైన కుర్రాడే. సాహిత్యం పిచ్చిలో పడిపోయి సెలెక్షన్ పరీక్షల్లో రోమన్ చరిత్ర పేపర్‌ని పాడుచేశాడు. ఎంతో బాగా రాస్తాడనుకున్న శిష్యుడిలా చెయ్యగానే పంతులుగారు వెంటనే ప్రిన్సిపాలు మంగు శ్రీనివాసరావు గారింటికి వెళ్ళి "ఒరేయ్ శ్రీనివాసరావూ! నువ్వు ఎవర్ని పరీక్షకు కట్టించినా సరే-నారాయణరావును మాత్రం కట్టిస్తే నా ఉద్యోగానికి రిజైన్ పెట్టేస్తా" నన్నారు.

పంతులుగారికి నచ్చజెప్పటం కుదరని పని అని అందరికీ తెలుసు. అన్నపూర్ణమ్మకు ఈ విషయం చెప్పి నారాయణరావు గొల్లుమన్నాడు. ఆమె కరిగిపోయి భోజనం దగ్గర నవ్వుతాల మాటల్లో పెట్టి పెరుగు అన్నం తింటున్న సమయంలో 'మన నారాయణరావూ!' అని చెవిలో గట్టిగా చెప్పింది. అంతే సంతోషమంతా ఎగిరిపోయి ఒక క్షణంలో ముఖం అగ్నిగోళమయింది. ఆ ఎంగిలి చేత్తోనే ప్రిన్సిపాలు గారింటికి వెళ్ళి "నా భార్య కూడా నారాయణరావును గురించి శిఫారసు చేస్తోంది. నువ్వు మాత్రం వాడిని పరీక్షకు కట్టించావంటే నాకూ నీ కాలేజీకి సరి" అని బెదిరించి వచ్చారు.

క్రుంగిపోయిన నారాయణరావు దాదాపు రెండు వారాలు

పాటు ఎక్కడికో పారిపోయాడు. మళ్ళీ ఆ అబ్బాయి తిరిగి వచ్చే దాకా పంతులుగారు పడ్డ పశ్చాత్తాపం మితిలేనిది.

శిష్యుడి కిలా నీతిని బోధించారు :

"ఆఁ! వచ్చావూ! నాయనా! చదువు ఊరకే వస్తుందటోయ్! పన్నెండేళ్ళయింది ఈ పనిచేస్తున్నాను. ఇప్పటికింకా ముగియలేదు. కష్టపడితే కాని కార్యము లేదోయ్! పో! కష్టపడి చదువు. పరీక్షకు కట్టుకో!" అంటూ భుజంమీద తట్టి ఒక్క కన్నీటి బొట్టు జార్చారు.

ఆ కన్నీటి చుక్క సాగరం లాగా నారాయణరావు హృదయాన్ని ఆక్రమించి ఆయన జీవితానికి ఒక లక్ష్యాన్ని కుదిర్చింది.

**ఆరమరికలులేని మనిషి :**

రామమూర్తికి దాపరికాలు లేవు. విమర్శలో ఎలాగో నిజ జీవితంలోనూ అబద్ధాలు చెప్పటం వారికి తెలియదు.

ఒకసారి అన్నపూర్ణమ్మ ఒక మేష్టారు తన భార్యని కొడుతున్నాడని తాను విన్నట్టు చెప్పింది. ఆ మాష్టారు ఒక రోజున రోడ్డు మీద కనిపించాడు.

"ఏమిటయ్యా నువ్వు నీ భార్యను కొడుతున్నావట."

"మీతో ఎవరన్నారండీ!"

"ఎవరో ఏమిటి? మా ఆవిడే చెప్పింది."

ఆ తర్వాత భార్య అడిగింది "ఏమండీ! మనలో మనం అనుకుంటే అవన్నీ ఆయనతో అంటారేమిటి?" అని. అపుడు పంతులు గారన్నారు :

"ఇతరులకు చెప్పటానికి వీలులేని విషయాలుంటే నాతో చెప్పొద్దు" అని.

* * *

విజయనగరం రాజావారి సంస్థానంలో భోగంమేళా జరుగుతోంది. మిత్రుడిని రమ్మన్నాడు అప్పారావు. త్రికరణశుద్ధిగా 'యాంటీ నాచ్చి' అయిన రామమూర్తి ఇష్టం లేకపోయినా ఉద్యోగ ధర్మమని వెళ్ళాడు. రాజావారితోపాటు ఆయనగారి భోగం సాని కూడా ఒకే సోఫామీద దర్శనమిచ్చింది. అంతే! సభామర్యాదలు కూడా పాటించకుండా సభలోంచి బయటకు వచ్చేశాడు. అప్పారావు కూడా ఏదో మిషపెట్టి బయటకు నడిచాడు. "రామమూర్తీ! మన కిష్టం ఉన్నా లేకపోయినా జమీందారుల సర్వీసు చేస్తున్నంతకాలం ఏవో కొన్ని నియమాల్ని పాటించక తప్పదయ్యా! నీలాగా ముక్కుకు సూటిగా వెళ్ళామంటే కొన్ని ఇబ్బందుల్లో పడతాం."

రామమూర్తి వెంటనే ఇలా అన్నాడు: "ఇదిగో ఇతరుల సంతోషం కోసం నా వ్యక్తిత్వాన్ని నేను చంపుకోలేను. నా అంతస్తత్వానికి పడని పనిని నేను చెయ్యను. నేను ఆత్మద్రోహిని కాను."

అలాంటి వారు కాకపోతే - ఇతరులు చెప్పిన కొండాలు విని రాణిగారు 'మీ పద్ధతి మార్చుకోండి. పాత పద్ధతిలో పాఠాలు చెప్పండి లేదంటే ఈ నెలాఖరుదాకా పనిచేసి ఉద్యోగం మానెయ్యవచ్చు' అని కబురంపితే నెలాఖరుదాకా ఎందుకు? ఇప్పుడే మానేస్తున్నా'నని ఆవాల్టినుంచి కోటకు వెళ్ళటం మానేస్తారా పంతులుగారు!

*సంస్కర్త హృదయం:*

రామమూర్తిగారు సంస్కర్తగా వీపుకి బోర్డు కట్టించుకుని తిరగలేదు. కాని ఆయన జీవితంలో సవరలతో ఆయన పొందిన తాదాత్మ్యం కాని, 1908 లో తన శిష్యుడు (కన్నేపల్లి నరసింహం)

ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చాడని విందు ఇవ్వగా బ్రాహ్మణులు వెలి వేసినపుడు గంగతీర్థం పుచ్చుకోక పోవటంలో కాని ఆయనలోని సంస్కర్త హృదయం కనిపిస్తుంది.

నిజానికి పంతులుగారి జీవితమంతా పండితుల, అధికారుల 'వెలి'తోనే గడిచిపోయింది. పర్లాకిమిడి జమీందార్లు ఎంత దూరం వెళ్ళారంటే కడకు 'మంగలి' కూడా వారింటికి వెళ్ళరాదని శాసించారు. ఆ మంగలికేమో పంతులుగారంటే అంత గౌరవం. వద్దన్నా మానకుండా వస్తున్నాడు. మంగలిని పోషించే తాహతు తనకు లేదు. అంచేత 6 నెలలపాటు గెడ్డం పెంచేశారట పంతులుగారు. అలా ప్రతి పనిలోనూ రామమూర్తి 'ముద్ర' ఒకటుండేది.

*సరసుడు - స్థితప్రజ్ఞుడు*

జయంతి రామయ్యగారు పంతులుగారిని జైనుడి లాంటి వాడన్నారు. సమకాలికులు 'విధ్వంసకు' డన్నారు.

భారతిలో ఎంకి పాట ఒకటి వచ్చింది. (ఎనక జలమంలోన ఎవరమోనంటి) - చదువుతూండగానే మార్జిన్‌లో 'ఎజెమ్' అని రాసుకుని, వెంటనే నండూరి సుబ్బారావుగారికి అభినందన సందేశం పంపారాయన.

చిన్నయసూరి దేశాని కిచ్చినదేమిటో ఇలా చెబుతున్నారు :

''అధికారానధికార తారతమ్యము ఆలోచించకుండా ఆబాలగోపాలం అందరి పిల్లల చేతను రచనా భ్యాసము చేయించ నుద్దేశించి అందుకు సాధనముగా అసమగ్రము, అనిర్ణాయకము, భ్రమ ప్రమాదాత్మకమున్ను అయిన ఒక చిన్న వ్యాకరణము ఒకటిన్ని అస్ఖలితము కాని చిన్న వచన గ్రంథ మొకటిన్ని రచియించి ఇచ్చి ఆ సూరిగారు కీర్తిశేషులయినారు. 'కొండవీటి సీమ లోని నూతులనుండి నీళ్ళుతోడి తెచ్చుకొని వంట చేసుకొని భోజ

నము చేయండి' అని 'బారెడు' చేంతాడు, తూట్లుపడ్డ చిన్న చెంబు ఆకలితో ఉన్న చిన్న పిల్లలు చేతిలో పెట్టి తలిదండ్రులు శ్రీశైల యాత్రకు వెళ్ళినట్లయినది.''

ఈ పోలికలో సత్యం ఎంతో కవిత్వం కూడా అంతే వుంది.

రామమూర్తిగారికి తగిన గృహిణి అన్నపూర్ణమ్మ. 1911 లో పర్లాకిమిడిలో కుంభవృష్టి కురిసింది. పంతులుగారేమో మేడమీద చదువులో మునిగిపోయి ఉన్నారు. 40 మంది నిరాశ్రయులై తలుపు తట్టారు. ఆ రాత్రంతా వారికి వండి వార్చి, అన్నపూర్ణమ్మ చేసిన సేవ అంతా ఇంతా కాదు.

బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారి అమ్మాయి భర్త చిన్న వయసులోనే పోయాడు. గిడుగు దంపతు లిద్దరూ పీటలమీద కూర్చుని వేదుల సత్యనారాయణతో ఆ అమ్మాయి పెళ్ళి జరిపారు.

60 ఏళ్ళు కలిసి ఉన్న భర్త వీడిపోతున్నాడని తెలిసి అన్నపూర్ణమ్మ ఏడుస్తూ ఒక మూలన నుంచుంది. రామమూర్తిగారు ఆమెను దగ్గరికి పిలిచి—

''పిల్లా! నీకన్నా నేను ముందు పుట్టాను కదా! మరి అలాగే నీ కంటె ముందు నేను పోవాలి. ఇది సహజం.''

అని ఆమెను సముదాయించారట.

అంచేతనే రామమూర్తిగారిని 'తపస్వి' అని అందరూ ప్రశంసించారు. లేకపోతే తాను పదేళ్ళపాటు తయారుచేసిన వ్యాకరణం తాలూకు నోట్సుని మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు అడగ్గానే ఇచ్చేస్తారా! అందుకే ఆధునిక సాహిత్యరంగంలో 'అజ్ఞాత శక్తి'గా ఆయన మిగిలిపోయారు.

## అధ్యాయం 5

# ఆధునిక సాహిత్యం - గిడుగు ప్రోద్బలం

తెలుగు సాహిత్యంలో కవులకు వచ్చిన పేరు కీర్తి ప్రతిష్ఠలు పరిశోధకులకు రాలేదు. కాని గిడుగు వారి విషయం వేరు.

'1910 తరువాతి ఆంధ్ర సాహిత్యం గిడుగు యుగమే' అని అన్న వారున్నారు.

సీతాపతిగారు (1968) "వ్యావహారిక ఉద్యమం రాకున్న కొత్త సాహిత్య ధోరణులు వచ్చేవేమో కాని ఇంత శీఘ్రగతిలో ఆధునిక సాహిత్య ధోరణులు విజృంభించేవి కావు. ఎందుకంటే అంతవరకే కావ్య శైలిగా స్థిరపడిపోయిన గ్రాంథిక శైలి ఆ రోజుల్లో ఆధునిక కవుల మీద కూడా తీవ్రమైన ప్రభావాన్ని చూపింది. వ్యావహారికోద్యమం రావటం వల్లనే బాల కవులకు (యువ రచయితలకు) అభివ్యక్తిలో స్వేచ్ఛ లభించింది" అన్నారు (చూ. పు. 149)

పంతులుగారి ప్రభావం పడని రచయిత ఆ రోజుల్లో లేడనే చెప్పాలి. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి తమ అవధానాల్లోనూ, వ్యాస రచనల్లోను వ్యావహారికం వాడటం మాత్రమే కాకుండా రామ మూర్తి సిద్ధాంతాన్ని ప్రచారం కూడా చేశారు: "తెలుగుకున్న వ్యాకరణ దీపం చిన్నది" అన్నది కూడా వారే. కవుల ప్రయోగాలే మనకి శరణ్యమని కూడా అంగీకరించారాయన. వారి శిష్యుడు సత్యనారాయణగారి లాంటి వాడు కూడా 'తెలుగు సరస్వతి నోముల పంట'గా రామమూర్తిగారిని ప్రశంసించారు. కిన్నెరసాని పాటల్లో విశ్వనాథ వ్యావహారికాన్నే వాడారు. రామాయణ కల్పవృక్షంలో పదాలు గ్రాంథికాలే కాని శైలి

మాత్రం వ్యావహారికమే. సాంప్రదాయికులు రామమూర్తిగారిని అనుసరించిన పద్ధతి ఇది.

ఈ శతాబ్దం నాల్గవ దశకం (1940 లలో) అభ్యుదయ సాహిత్యం పూర్వమున్న 'భావకవిత్వం' నుండి వెలువడి ఒక శకాన్ని సృష్టించింది. 1934 లో పుట్టిన 'మహాప్రస్థానం'తో శ్రీశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కన్నా భిన్నంగా 'విప్లవ కవితా యుగకర్త' అయ్యాడు.

''మహాప్రస్థాన గీతాలకు కారణం ఎవరంటే భాషకు సంబంధించినంతవరకు గిడుగువారే అంటాను. మహాప్రస్థానం పూర్తిగా వాడుక భాషలో సాగిన రచన'' అని శ్రీరంగం శ్రీనివాసరావుగారే రాంమూర్తి ప్రభావాన్ని స్పష్టం చేశాడు.

1951 లో కె. వి. రమణారెడ్డిగారు 'కళాప్రపూర్ణుడి వాగ్యుద్ధాలను సమీక్షిస్తూ గిడుగువారు ఎలా రాయాలో చెప్పారు కాని ఏం రాయాలో చెప్పలేదన్నారు. నిజమే! రామమూర్తిగారి చుట్టూ ఉన్న సాహిత్యం, సాహిత్య రాజకీయాల మీద, రాజకీయ సాహిత్యాలమీద అప్పారావు రామమూర్తిగారలకున్న దృష్టులూ 'విప్లవాత్మ'కం కావు. కాని స్పష్టంగా విప్లవానికి ఉన్ముఖమైనవే. 'ప్రజావిద్య' అని పంతులుగారు కోరుకొన్నది వస్తువులోను రూపంలోను సాహిత్యంలో మార్పును తీసుకు వచ్చే చదువునే.

అందుకే ఈనాడు గద్దర్, వంగపండు ప్రసాదరావు, అల్లం రాజయ్య, శివసాగర్ మొదలైన ప్రజా రచయితల ప్రజాకళా రూపాల్ని చూసి వుంటే రామమూర్తిగారు తమ ఉద్యమం సఫలమైందని సంతసించేవారు.

ఒకప్పుడు విద్యాలయాల్లో ఎవరైనా అబ్బాయి వ్యావహారికంలో రాస్తే 'ఓహో పర్లాకిమిడీ గాలి విసిరింది కాబోలు' అని

అపహాస్యం చేసేవారు. ఈనాడు విశ్వవిద్యాలయాల్లో పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథాలు కూడా చక్కగా వ్యావహారికంలో రాస్తున్నారు.

రామమూర్తిగారి తుది విన్నపాన్ని ఆచరణలో పెట్టిన ఎన్. జి. ఆచార్య, తాపీ ధర్మారావు, నార్ల వేంకటేశ్వరరావు, కొడవటిగంటి కుటుంబరావు మొదలైన పత్రికా రచయితలు, సంపాదకుల దీక్షవల్లే ఈనాడు తెలుగుజాతి జాగృతమైంది.

గిడుగువారు ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతలలో ఒకరుగా చిరస్థాయిని పొందారు. ఆధునిక సాహితీ వైతాళికుడు అప్పారావుగారిని స్మరించినపుడల్లా రామమూర్తి మిత్రుడి పక్కనే ఎప్పుడూ స్మృతిలో మెదులుతుంటాడు.

*　　　*　　　*

"అనాదిగా ఋషులకు జన్మభూమి ఐన ఈ భారత క్షేత్రములో ఇప్పటికీ ఋషులు అవతరిస్తూనే ఉన్నారు. ఋషి కల్పులైన అటువంటి మహాభావులలో ఒకరు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారు..."

"...ఇతర రాష్ట్రముల వారు కాని, విదేశీయులుగాని మా తెలుగు తల్లి కన్న గొప్ప సుపుత్రుని పేరు చెప్పమని అడుగుతే మనము తడుముకోకుండా, 'ఇదుగో గిడుగు రామమూర్తి' అని చెప్పగలము. 'ఆయన ఎక్కడ ఉన్నా'డని అడిగితే మాత్రము ఆకాశమువంక గంభీరముగా చూచి ఒక్క కన్నీటి చుక్క విడుద్దాం."

[ నోరి నరసింహశాస్త్రి : ప్రతిభ-4 (1940) ]

# గ్రంథసూచిక

గిడుగు రామమూర్తి రచనలు (పరిశవి)

ఆంగ్ల గ్రంథాలు


1. The Savara / Telugu/Telugu-Savara Texts (1911) Govt, Press, Madras.
2. A Memorandum on Modern Telugu (1913) Vavilla Publications, Madras.
3. A Manual of Sora Language (1931) Govt. Press, Madras.
4. English-Sora Dictionary (1933) Govt. Press, Madras.
5. Sora-English Dictionary (1938) Govt. Press, Madras. (repr.) Mittal Publication, New Delhi (1986)

   అనువాదం (తెలుగులోకి)

6. A shorter English Grammar (by Otto Jesperson) (1914) (Not published) ఆంగ్ల వ్యాసాలు.
7. 'State of Education among the Savaras', Journal of Madras Christian Literary Society' (Septi. 1894)
8. 'An account of Antiquities of Mukhalingam and its neighbourhood', Madras Journal of Education and Science (1894)
9. 'Introduction' to 'Telugu' journal (1-1; 1919)
10. How to approximate written and spoken Telugu in Telugu (Vol. 12 : 1920)

11. 'Freedom to use the current language in Vyasavali (1933 : (125-130)
12. 'Who can fix a living language?' in Vyasavali (pp. 31–141)
13. 'Popular Literature !' ibid (pp. 142-154)
14. 'Popular Literature II' ibid (pp. 155-162)
15. 'Popular Literarure III' ibid (pp. 163-173)

*తెలుగు (గ్రంథాలు)*

16. 'నిజమైన సంప్రదాయము' వావిళ్ళ ప్రచురణ, మద్రాసు (1914)
17. 'గద్యచింతామణి'
18. 'బాలకవి శరణ్యము'
19. 'ఆంధ్రపండిత భిషక్కుల భాషా భేషజము'
20. 'వ్యాసావళి'

(17–20:) తెలికిచెర్ల వెంకటరత్నం (సం) సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణలు రాజమండ్రి (1933)

21. 'సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనము' (1938)
[18-21 గ్రంథాల్ని విశాలాంధ్ర ప్రచురణాలయం 1958 నుండి పునర్ముద్రిస్తోంది]

| *పీఠికలు* | *రచయిత* | *రచన* |
|---|---|---|
| 22. | పసుమర్తి కృష్ణమూర్తి | *'గృహలక్ష్మీ కంఠాభరణము'* |
| 23. | గుడిపాటి వెంకటచలం | *'చిత్రాంగి'* |
| 24. | యల్లాపంతుల జగన్నాథం | *'తరణోపాయము'* |
| 25. | యల్లాపంతుల జగన్నాథం | *'గాదెలగండడు-కొండల మిండడు'* |
| 26. | గుళ్ళపల్లి నారాయణమూర్తి | *'ఆంధ్రజ్యోతి'* |

27. ఈకుమళ్ళ కామేశ్వరరావు 'వాడుక భాష రచనకు కొన్ని నియమాలు'

లేఖలు (లభ్యమైనవి)

28. వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి (1924-28)

29. 'వజ్రాయుధ' సంపాదకులకు (1925)

30, 'ప్రబుద్ధాంధ్ర' సంపాదకులకు (1935)

31. 'తెలుగు పత్రికా' సంపాదకులకు (1937)

32. 'వీణ'కు (1937)

వ్యాసాలు

33. *'గ్రామ్యపద ప్రయోగం'* ఆంధ్రభారతి (2-12; మే 1912)

34. *'నేటి తేట తెలుగు'* ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1913)

35. *'గ్రామ్య భాష కాదు, వాడుక భాష'* త్రిలింగ (1-7; జూలై 1914)

36. *'తెలుగు ప్రాత-క్రొత్త'* త్రిలింగ (మార్చి 1914)

37. *'ప్రాఁదెనుఁగుఁగమ్మ'* ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక (2-3; 1914; 256-275)

38. *'విన్నపము'* తెలుగు (1-1; 1919)

39. *'చిన్నయసూరి నీతి చంద్రిక'* తెలుగు 1-1 (1919)

40. *'మిథ్యాపవాదము'* సారస్వత సర్వస్వము 1-7 (1924)

41. *'వ్యావహారిక భాషా బహిష్కార నిరసనము'* ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక (1924)

42. *'రాజరాజు కాలమందున్న తెలుగు భాష'* రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక (1924)

43. 'నేటి సాహిత్యము' ప్రతిభ 1-4 (1937)

44. 'శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల ప్రశంస' కృష్ణాపత్రిక (7-10-1937)

45. 'తుది విన్నపము' ప్రజామిత్ర (జనవరి 1940)

## ఉపయుక్త వాఙ్మయం

*గిడుగు మీది రచన*

46. సూర్యనారాయణ, కాళ్ళకూరి (1955) '*గిడుగు రామమూర్తి పంతులుగారి జీవిత చరిత్ర*' వావిళ్ళ వారి ప్రచురణ, మదరాసు.

47. సీతాపతి, గిడుగు వెంకట (1941) '*రామమూర్తి పంతులు గారి జీవిత చరిత్రలోని చిత్ర విచిత్రఘట్టాలు*' ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక.

48. సీతాపతి, గిడుగు వెంకట (1964) '*గత కాలపు స్మృతులు*' కృష్ణాపత్రిక.

49. సీతాపతి, గిడుగు వెంకట (1964) '*సాహిత్యోపన్యాసములు*' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు.

50. సీతాపతి, గిడుగు వెంకట (1968) '*తెలుగు సాహిత్య చరిత్ర*' (ఆంగ్లంలో), సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ.

51. రామమూర్తి జి. వి. (1972) '*సవరలు*' దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ.

52. రామమూర్తి జి. వి. (1976) '*గిడుగు రామమూర్తి*' (జీవిత చరిత్ర) ఆంధ్రప్రదేశ్ సమాచార అండ్ పౌర సంబంధాల శాఖ ప్రచురణ, హైదరాబాదు.

53. రామారావు, చేకూరి (సం) (1986) **'మరోసారి గిడుగు రామమూర్తి'** హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ, హైదరాబాదు.

54. వెంకటరత్నం, తెలికిచెర్ల (1933) **'సంపాదకీయ భూమిక'** (జన్మదినోత్సవ ప్రచురణలకు)

55. వెంకటరత్నం, తెలికిచెర్ల (సం) (1933) **'వ్యాససంగ్రహము'** (A miscellany of papers presented in honour of G. V. Ramamurthi)

56. వెంకటరత్నం తెలికిచెర్ల (1964) **'సాహిత్యోపన్యాసములు'** ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు.

57. సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద (1935) **'రామమూర్తి పంతులుగారితో 36 గంటలు'** ప్రబుద్ధాంధ్ర (డిసెంబరు) చూ. అభ్యుదయ (1980; 1-13)

58. సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద (1958) **'అనుభవాలు-జ్ఞాపకాలు'** కళావర్ధని పరిషత్తు, రాజమండ్రి.

59. చంద్రశేఖర్, సాతవల్లి (1987) **'గిడుగు రామమూర్తి పంతులుగారి భాషా సాహిత్య సేవ'** పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథం, ఎస్. వి. యూనివర్సిటీ తిరుపతి (రచనలో)

*సంప్రదించిన రచనలు*

60. అప్పారావు, గురజాడ వెంకట (1957) **'వ్యాసచంద్రిక'** అవసరాల సూర్యారావు (సం) విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ.

61. అప్పారావు, గురజాడ వెంకట (1958) **'లేఖలు'** పై ప్రచురణ.

62. ఆనందమూర్తి, వేటూరి (1982) '*గిడుగువారి లేఖలు*', మణిమంజరి (ఫిబ్రవరి) ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు.

63. ఆరుద్ర (1986) '*శాసన పరిశోధకులుగా గిడుగు గురజాడ*' [చూ. గ్రంథ సూచిక 53; 80-94]

64. కామేశ్వరరావు, టేకుమళ్ళ (1966) '*నా వాఙ్మయ మిత్రుడు*' ('నా వాఙ్మయ మిత్రులు' నుండి) (చూ. 53; 163-169)

65. కృష్ణమూర్తి, భద్రిరాజు (సం] (1975) '*తెలుగు భాషా చరిత్ర*' (వ్యాస సంకలనం) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

66. దక్షిణామూర్తి పోరంకి (1986) '*గిడుగు మెమొరాండం : గురజాడ డిసెంటు పత్రం*' (చూ. 53; 119-125)

67. ద్రోణప్ప, తూమాటి (1986) *వ్యావహారిక భాషోద్యమ నేపథ్యం - గిడుగువారి సారథ్యం*' తెలుగు విద్యార్థి (అక్టోబరు) (చూ. 53; 197-202)

68. ధర్మారావు, తాపీ (1979) '*రాలూ-రప్పలూ*' ఏటుకూరి ప్రసాద్ (సం) విశాలాంధ్ర ప్రచురణ, హైదరాబాదు,

69. నరసింహశాస్త్రి, నోరి (1940) '*రామమూర్తి పంతులు*' ప్రతిభ 4 (చూ. 53; 183-187)

70. నారాయణరావు, చిలుకూరి (1937) *ఆంధ్ర భాషా చరిత్రము* 1 & 2 ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు.

71. నారాయణరావు, చిలుకూరి (1940) *నా గురువుగారు*, ప్రతిభ 4 (చూ. 53; 188-191)

72. ప్రసాద్, ఏటుకూరి (1986) *'గురువుకు తగ్గ శిష్యుడు'* (చూ. 53; 126-129)

73. బ్రహ్మానందం, హెచ్.ఎస్. (1983) *తెలుగు భాషాసాహిత్య పరిశోధనలు, పుట్టు పూర్వోత్తరాలు (ప్రాథమిక దశ)*, చూ. జి. వి. సుబ్రహ్మణ్యం (సం) పు. 33-50.

74. బ్రహ్మానంద, హెచ్. ఎస్. (1985) *'తెలుగు సాహిత్య విమర్శ : పాశ్చాత్య ప్రభావం'* అక్షర ప్రసార ప్రచురణ, అనంతపురం.

75. బ్రహ్మానంద, హెచ్. ఎస్. (1986) *'తెలుగు సాహితీ సన్నాయి ఒరవడి'* పై ప్రచురణ.

76. రంగనాథాచార్యులు, కె. కె. (సం) (1984) *నూరేళ్ళ తెలుగునాడు*, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

77. రమణారెడ్డి, కె. వి. (1951) *'కళాప్రపూర్ణుడూ : వాగ్యుద్ధాలూ'* కిన్నెర (3-2)

78. రమణారెడ్డి, కె. వి. (1969) *'మహోదయం'* విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ.

79. రమాపతిరావు, అక్కిరాజు (1971) *'వ్యావహారిక భాషా వికాసం, చరిత్ర'* ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం.

80. రమాపతిరావు, అక్కిరాజు (1986) *'సమస్కంధులైన తండ్రీ కొడుకులు'* (చూ. 53; 140-147)

81. రాధాకృష్ణ, బూదరాజు (1972) *'వ్యావహారిక భాషా వికాసం'* విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ.

82. రాధాకృష్ణ, బూదరాజు (1975) *ఆధునిక యుగం : గ్రాంథిక వ్యావహారిక వాదాలు'* చూ. భ. కృష్ణమూర్తి (సం : 264-294)

83. రామకృష్ణారావు, అడపా (1986) *'సంఘ సంస్కర్తగా గిడుగు'* (చూ. 53; 101-108)

84. రామారావు, చేకూరి (1975) *రామమూర్తిగారు వ్యావహారిక భాషావాది ఎందుకయ్యారు?* ఆధునికాంధ్ర సాహిత్య నిర్మాతలు కళాసాహితి, హైదరాబాదు [పు. 36-43] (చూ. 53; 95-100)

85. రామారావు, చేకూరి (1984) **భాషోద్యమాలు**, చూ. కె. కె. రంగనాథాచార్యులు (సం) (పు. 61-75)

86. శ్రీనివాస శిరోమణి (1940) *'గిడుగు రామమూర్తి పంతులుగారు నా అనుభవాలు'* (భారతి, మార్చి, చూ. 53; 170-179)

87. శ్రీశ్రీ (1982) *'తెలుగు కావ్య భాషమీద గి. రాంమూర్తి ప్రభావం'* (చూ. 53; 76-79)

88. సత్యనారాయణ, విశ్వనాథ (1953) **తెలుగు** *సరస్వతి నోముల పంట శ్రీ గిడుగు రామమూర్తి'* కృష్ణా పత్రిక (జనవరి)

89. సీతాపతి, గిడుగు వెంకట (1930) *'సవరలు'* రాళ్ళబండి సుబ్బారావు (సం) కళింగదేశ చరిత్రములో (చూ. 53; 20-39)

90. సుబ్రహ్మణ్యం, జి. వి. (సం) )1983) *'పరిశోధన'* రజతోత్సవ సంచిక, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు.

91. సుబ్బారావు, రాళ్ళబండి (సం) (1930) *'కళింగదేశ చరిత్రము'* ఆంధ్రేతిహాస మండలి, రాజమండ్రి.

92. వెంకటరావు, నిడుదవోలు (1934) *'ఆధునిక రచన -వాఙ్మయ పరిణామము'*

93. వెంకటశాస్త్రి, చెళ్ళపిళ్ళ (1937) ***'గిడుగా! పిడుగా!'*** కృష్ణాపత్రిక (మే 15) (చూ. 53; 148-159)

94. **అభ్యుదయ** (వాడుక భాషా సదస్సు విశేష సంచిక) ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జరిగిన సదస్సు ప్రసంగాలు (ఏప్రిల్ 1980)

95. *గ్రాంథిక వ్యావహారిక భాషావాద సూచిక* తెలుగు అకాడమీ ప్రచురణ, హైదరాబాదు (1980)

96. Annamalai, E (1979) 'Language movements in India', CIIL Pub. Mysore.

97. Appa Rao G. V. (1897) 'Preface' to Kanyasulkam (1st ed.)

98. Appa Rao G. V. (1914) Minute of Dissent to the Report of the Telugu composition sub committee, Vavilla Pub. Madras.

99. Ferguson, Charles. A (1957) Diglossia, repr. in Dell Hymes (ed) 'Language in Culture and Society', Harper and Row, New YarK (1964 : 429-439)

100. Grierson, Sir, George A (1927) 'Linguistic Survey of India (vol I) Motilal Banarsidas (repr ) New Delhi (1967)

101. Jesperson Otto (1922) 'Language, its nature development and origin'. George Allen & Unwin Ltd. London (repr, 1968 : fn to p 330)

102. Krishnamurthi Bh. (1979) "Classical or Modern A Controversy of styles in Education in Telugu', in E. Annamalai (ed) pp 1–24)

103. Nirmal Kumar Bose (1972) Some Indian Tribes, NBT Pub. (repr. 1982)

104. Ramaiah Pantulu J. (1913) 'A Defense of Literary Telugu' Addison & Co. Madras.

105. Stanley starosta (1980), 'Ramamurti : A Munda Linguist's Apprceiation (Sec. No. 53 : 211-217)

106. Sreenivasa Iyengar P.T. (1912) 'Life or Death: A plea for Vernaculars'

107. Thurston E.H. (1909) 'Castes and Tribes of South India'. Vol (IV)

108. Yates J. A. (1933) Reminiscences in T. Venkata-ratnam ed, (22–26) (See. 53 : 218-222)

# రామమూర్తి జీవితంలో ముఖ్యమైన తేదీలు

**29-8-1863** జననం (తండ్రి: వీరరాజు పంతులు; తల్లి: వెంకమ్మ)

**1868** అక్షరాభ్యాసం

**1874** ఉపనయనం

**1875** వీరరాజుగారి మరణం

**1879** మెట్రిక్యులేషన్ / అన్నపూర్ణమ్మతో వివాహం

**1880** పర్లాకిమిడిలో అసిస్టెంటు టీచరుగా నియామకం

**25-1-1885** సీతాపతి జననం

**1897** ఎఫ్. ఎ. లో ఉత్తీర్ణత

**1889** సవరజాతి వారితో పరిచయ ప్రారంభం

**1892** బి. ఎ. లో ఇంగ్లీషు, సంస్కృతం ఉత్తీర్ణత
నారాయణదేవ్‌గారికి ట్యూటర్‌గా నియామకం

**15-1-1893** ముఖలింగం సందర్శనం

**1894** సవరభాషాభివృద్ధికోసం రిపోర్టు పంపటం

**1896** బి. ఎ. చరిత్ర విభాగం పరీక్షలో రెండో ర్యాంకు,
కాలేజీలో అధ్యాపకుడుగా నియామకం

**1906** జె. ఎ. ఏట్సుతో పరిచయం మొదలు

**1908** వెల్ష్‌మన్ గిడుగువారి దగ్గర సవరభాష నేర్చుకోవటం మొదలు

**1910** విశాఖపట్టణం ఉపాధ్యాయ సదస్సులో ఉపన్యాసం

**12-11-1911** ఉద్యోగ విరమణ, 'సర్టిఫికేట్ ఆఫ్ మెరిట్'ను
ప్రభుత్వం ఇవ్వడం. సవర-తెలుగు గ్రంథాల ప్రచురణ

**1-1-1913** 'రావు సాహెబ్' బిరుద ప్రదానం
విజయ నగరంలో ట్యూటర్‌గా ప్రవాసం, 'ప్రాఁదెనుఁగుఁ గమ్మ', 'మెమొరాండం' రచన. సెరంగోలో సవర పాఠశాల ప్రారంభం

**1914** పర్లాకిమిడికి తిరిగి రాక. 'నిజమైన సంప్రదాయం' రచన.
దేశసంచార ప్రారంభం

1917 వెల్ష్‌మన్ మృతి

1919 తెలుగు పత్రిక ప్రారంభం (1920 దాకా)

1920–1926 తెలుగు భాషా సాహిత్య పరిశోధనలు

1928 మిస్ మన్రో సవర భాషాధ్యయనం మొదలు పెట్టడం

1929 సెరంగోలోని సవర ఇన్స్టిట్యూట్‌కి 'వెల్ష్‌మన్'పేరు పెట్టడం

1931 మాన్యువల్ ఆఫ్ సొరలాంగ్వేజ్ ప్రచురణ

1–1–1933 ఇంగ్లీషు సొర నిఘంటు ప్రచురణ.
కైజర్–ఇ–హింద్ బంగారు పతకం ప్రదానం

27–12–1933 సప్తతితమ జన్మదినోత్సవాలు – బాలకవి శరణ్యం, గద్య చింతామణి, భాషా భేషజం, వ్యాసావళి, వ్యాస సంగ్రహం ప్రచురణ, సీతాపతి లండన్ ప్రయాణం

1934 భారతీ తీర్థ సభ వారిచేత 'మహా మహోపాధ్యాయ' బిరుద ప్రదానం

6–5–1935 రజతోత్సవ పతకం ప్రదానం

1–4–1936 ఒరిస్సారాష్ట్ర ప్రారంభం–పంతులుగారు పర్లాకిమిడి వదలి పెట్టడం

1938 ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచేత 'కళాప్రపూర్ణ' బిరుద ప్రదానం, సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శన ప్రచురణ

4–1–1940 తలిదండ్రులతో సీతాపతి సమాగమం

15–1–1940 ప్రజామిత్ర ఆఫీసులో 'తుది విన్నపం'

17–1–1940 పంతులుగారు తండ్రికి చేసిన కడపటి ఆబ్దికం

22–1–1940 ఉదయం 7–20: రామమూర్తి దేహ త్యాగం

1942 అన్నపూర్ణమ్మ మరణం

1969 సీతాపతి మృతి